# నవశక్తి

చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధసంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |


* * *

అడ్వర్టైజుమెంటు రేటులు

"కాలం" వెడల్పు 2" (రెండు అంగుళాలు)

| | |
|---|---|
| కాలంలో 1" మొదలు 20" వరకు ప్రతి అంగుళానికి | రూ. 0—6—0 |
| 20"—100" వరకు .. | 0—4—0 |
| 100" పైగా .. | 0—3—0 |
| పాతిక పేజీకి | 3—0—0 |
| సగము పేజీకి | 6—0—0 |
| ఒక పేజీ మొదలు 15 పేజీల వరకు పేజీ ఒకటికి | 10—0—0 |
| 15 పేజీలకు పైగా పేజీ 1కి | 7—8—0 |

ఈ వరకు అంగీకరించిన కంట్రాక్టులకు ఈ రేట్లు వర్తించవు.

ఈ రేట్లలో కన్సెషన్ను కమిషను ఏమీ ఉండవు.

* * *

చందాదారులను చేర్పించాలి:

ఆం॥ కాం॥ సో॥ పార్టీ కార్యనిర్వాహక వర్గము, మొన్న సమావేశమైనపుడు యీ క్రింది ప్రకారం ప్రతిజిల్లా పార్టీ జూలై నెలాఖరులోపల చందాదారులను చేర్పించ వలసినదిగా తీర్మానించింది. మొదటి 2 వారాలలో చేర్పించిన చందాదారుల సంఖ్యనుకూడ క్రిందనిస్తున్నాము. పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజాసామాన్యము, ఈ "కోటాలు" పూర్తి అయ్యేటట్లు పనిచేస్తారని ఆసిస్తున్నాం.

| జిల్లా | జూలైకోటా | రెండు వారాలలో చేర్పించినవి. |
|---|---|---|
| విశాఖపట్టణం | 20 | 0 |
| తూర్పు గోదావరి | 75 | 3 |
| పశ్చిమ గోదావరి | 250 | 5 |
| కృష్ణా | 150 | 5 |
| గుంటూరు | 125 | 2 |
| నెల్లూరు | 50 | 14 |
| చిత్తూరు | 20 | 0 |
| కడప | 5 | 0 |
| కర్నూలు | 20 | 0 |
| అనంతపురం | 5 | 0 |
| బళ్లారి | 5 | 0 |
| ఇతర స్థలాలు | 25 | 0 |
| | 750 | 29 |

* * *

చందాదారులకు విజ్ఞప్తి.

కొంతమంది తాము మా ఏజెంట్లకు చందాడబ్బు ఇచ్చామనియు, పత్రిక రావడము లేదనియూ జాబులు వ్రాస్తున్నారు, మా ఏజెంట్లు విడిప్రతుల నమ్మడానికే మేము బాధ్యులము. వారికి చందా చెల్లించినవారు వారివద్ద నుండియే పత్రిక తీసికొనవలయును. లేదా ఆఫీసుకు తిన్నగా చందాను మనియార్డరు ద్వారాగాని లేక కాన్వాసింగు ఏజెంట్ల ద్వారాగాని పంపించవలయును. దీనిని అందరు గమనించ ప్రార్థన.

మా కాన్వాసింగు ఏజెంట్లు రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక సభ్యులు, జిల్లా పార్టీల కార్యనిర్వాహక సభ్యులు, పట్టణ, తాలూకా పార్టీల కార్యదర్శులు.

---



---



---



---



---



---

# సంస్థాన ప్రజల స్వాతంత్ర్యోద్యమం

## పౌరసత్వ హక్కులకై జీవన్మరణ పోరాటము

### హైదరాబాద్

సంస్థానంలో బహిరంగ సభలు, ఊరేగింపులు మొదలైనవాటిని గురించి యీ మధ్య సంస్థాన ప్రభుత్వం చేసిన నిబంధనల యెడల అసమ్మతిని తెలుపుటకు హైదరాబాద్ సంస్థాన ప్రజల కన్వెన్షన్‌యొక్క కార్యనిర్వాహక వర్గం సమావేశమై ఒక తీర్మానం చేసెను. 53 వ గస్తీ తొలగింపబడ్డను, పూర్వముకంటె యిప్పుడు ఎక్కువ చిక్కు పరిస్థితు లేర్పడినవనియు, పూర్వం ఒక్కరాజకీయ సభలకు మాత్రం ప్రభుత్వానుమతి అవసరమైయుండగా యిప్పుడు మతసంబంధమైన సభలకుకూడా అనుమతి అవసరమనియు, అనుమతి కావలసిన సభలు, ఊరేగింపులు వగైరా ఏవేవో స్పష్టంగా రూల్సు చెప్పుటలేదనియు, కాబట్టి సంస్థాన ప్రభుత్వముయొక్క కొత్తరూల్సును ఖండిస్తూ తీర్మానం ఆమోదింప బడింది.

#### మహారాష్ట్ర కాన్ఫరెన్సు.

హైదరాబాద్ సంస్థానమందలి మహారాష్ట్ర కాన్ఫరెన్సు మత సంస్థ అంటూ యీ మధ్య ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. ఆ ప్రకటనను ఖండిస్తూ మహారాష్ట్ర కాన్ఫరెన్సుయొక్క వర్కింగు కమిటీవారొక తీర్మానం ప్యాసు చేశారు.

#### గుణపాఠం.

నైజాం ప్రభుత్వం జారీచేసిన కొత్తరూల్సు మత కలహాలను ఆపుటకేనని ప్రభుత్వం ప్రకటించింది. మహారాష్ట్ర కాన్ఫరెన్సు ఒకమత సంస్థ అంటూ మరొక ప్రకటన చేసింది. ఇది మతసంస్థ కాదని వర్కింగు కమిటీవారు తెలియచేస్తున్నారు. ఇవన్నీ చూస్తే ఒక్కవిషయం స్పష్టముగా బోధపడుతుంది.

హైదరాబాద్‌లో యిప్పుడే విజృంభిస్తూన్న రాజకీయ చైతన్యాన్ని, ప్రజా ఉద్యమాన్ని మత కలహాలను పేరుతో అరికట్టుటకు నైజాం ప్రభుత్వం ప్రయత్నిస్తోంది.

### మైసూరు

మైసూరు సంస్థాన కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం బెంగుళూరులో సమావేశమై, బి. యన్. గుప్తా, సి. బి. మొన్నయ్యగార్లపై యింకను ప్రభుత్వం నిషేధాన్ని తొలగించకపోవుట రాజీ షరతులకు వ్యతిరేకం కాబట్టి వెంటనే వారిని మైసూరు సంస్థానమునకు రానీయవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించెను. ఈ విషయమై వల్లభాయి పటేల్‌గారికి తెలియజేయగా, చిన్ని విషయాలపై సంక్షోభమును తెచ్చిపెట్టవద్దని ఆయన జవాబు వ్రాశారు. ఇద్దరు సంస్థాన కాంగ్రెసు ప్రముఖులు యిందు నిమిత్తమై పటేల్‌గారితో మాట్లాడుటకు బొంబాయి బయల్దేరారు.

### మేవాడ్

మేవాడ్ సంస్థానమందలి ప్రజామండలి అనే సంస్థ అక్రమ సంఘమని సంస్థానాధీశ్వరుడు ప్రకటించాడు. దాన్ని స్థాపించిన మణిక్‌లాల్ వర్మగారిని సంస్థానము నుంచి బయటికి పంపివేశారు. ఆయనపైనను, ప్రజామండలి పైనను నిషేధాన్ని తొలగించ వలసిందని అఖిలభారత స్వదేశ సంస్థాన ప్రజల కాంగ్రెసు తరఫున దాని కార్యదర్శి బలవంత్ర మెహతాగారొక ప్రకటన చేశారు.

### నీలగిరి

నీలగిరి సంస్థానాధీశ్వరుడు ప్రజలపై జారీ చేసిన కొత్తరూల్సును ధిక్కరించుటకు ప్రజలు సత్యాగ్రహం ప్రారంభించారు. ఇప్పటికి 92 రిని ఎరస్టు చేశారు. ఒక్కొక్కరికి మూడేసి, ఆరేసి నెలలచొప్పున జైలు శిక్ష విధిస్తున్నారు. అయినప్పటికి ప్రజలు ధైర్యంతో సత్యాగ్రహాన్ని సాగిస్తున్నారు.

### సోహావాల్

ఈ సంస్థానంలో రైతుల యిబ్బందులను గురించి కాంగ్రెసువారొక బహిరంగ సభను యేర్పాటు చేశారు. అనేక గ్రామాలనుంచి రైతులు హాజరయారు. కాని, సంస్థానోద్యోగులు మీటింగుకు వెళ్ళవద్దని తోవలో అటంకపరచారు. మేము వెళ్ళకమానం అని కొంతమంది గ్రామస్థులు చెప్పగా సంస్థానోద్యోగులు ప్రజలపై తుపాకులు కాల్చారు. 5రికి గాయాలు తగిలాయి.

పన్నులు వసూలుచేయుటకు వెళ్ళిన ఉద్యోగస్థులపై మొదట ప్రజలు తుపాకులు పేల్చిరనియు, దానిపై ఆత్మరక్షణ కొరకు తిరిగి కాల్చవలసి వచ్చిందనియు సంస్థాన ప్రభుత్వం ప్రకటన చేసింది.

బ్రిటిషు ఇండియాలోనే, ఆయుధ శాసనం ప్రకారం యెవరూ స్వేచ్ఛగా తుపాకులు, రైఫిల్సు ఉంచుకోకూడదు. అతి పురాతన పద్ధతులతో ప్రజలను పీడించే సంస్థానాధీశ్వరులు తమ సంస్థాన ప్రజలకు తుపాకులు, రైఫిల్సు, మర ఫిరంగులు ఉంచుకోడానికెట్లు అనుమతి యిచ్చారా అనేదే అనుమానం.

### శికార్

శికార్ సంస్థానంలో పరిస్థితులు మారలేదు. జయపూర్ సంస్థానపు సిపాయిలు, సికార్ రాజపుత్ర సైనికులు తుపాకులతో సిద్ధంగా ఉన్నారు. ఏ నిమిషంలో పోరాటం వస్తుందో చెప్పలేం. శికార్ ప్రజల ప్రధాన కోరికలు రెండు. మొదటిది రాజకీయ ఖైదీలను విడిచిపెట్టాలి. రెండవది తమ రాజుపై నిషేధాన్ని తొలగించాలి.

కాంగ్రెసు నాయకులైన జమ్నాలాల్ బజాజ్, వల్లభాయి పటేలుగార్లను రాజీ చేయమని కొందరు కోరారు. శికార్ రాజపుత్రులు దౌర్జన్య పద్ధతులతో పోరాటం సాగించటం బాగులేదని వల్లభాయి గారన్నారు. అయినప్పటికిని రాజీచేస్తాం అని బజాజ్, పటేలుగార్లు వాగ్దానం చేశారు. లండన్‌లో పార్లమెంటు మెంబర్లు ప్రశ్నలడుగు తున్నారు. సరియైన సమాధానాలు రావటం లేదు. జైపూర్ మహారాజాగారు పోలో ఆటలను కట్టిపెట్టి ఇండియాకు ప్రయాణమయ్యారు.

ఈ సమస్యను గురించి ఆందోళన చేయుటకు కలకత్తాలో బ్రహ్మాండమైన సభ జరిగింది. సుభాష్ బోసు అధ్యక్షత వహించాడు. శికార్ పరిస్థితులను గురించి సమగ్రమైన విచారణ సలుపుటకొక కమిటీని నియమించాలనియు; వెంటనే జయపూర్ సంస్థాన మంతటిలోను బాధ్యతాయుత ప్రభుత్వాన్ని నెలకొల్పాలనియు రెండు తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించ బడ్డాయి. తన ఉపన్యాసంలో బోసుగారీ విధంగా మాట్లాడారు.

"ఈ తగాదా శికార్ రాజునకు, జయపూర్ రాజునకు మధ్యకాదు, అట్లయితే, కాంగ్రెసు యీ విషయంలో జోక్యం చేసుకొని యుండేది కాదు. ఇది శికార్ ప్రజల హక్కులకు, వారి సౌకర్యములకు సంబంధించిన సమస్య. కనుకనే కాంగ్రెసు యీ విషయంలో విశేషమైన శ్రద్ధ తీసుకొంటోంది. కాంగ్రెసు సంస్థ బ్రిటిషు ఇండియా ప్రజల స్వాతంత్ర్యం కొరకేగాక, సంస్థాన ప్రజల స్వాతంత్ర్యం కొరకు కూడా పోరాడుతోంది. కనుక, సంస్థాన ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వం కొరకు నేడు చేస్తూన్న పోరాటానికి కాంగ్రెసు సంస్థ సహాయం జేస్తూనే ఉంటుంది.

### తిరువాన్కూరు

సుమారు అయిదారు మాసములనుండి తిరువాన్కూరు సంస్థాన ప్రజల పౌరసత్వహక్కులకై ధైర్యంగా పోరాడుతూన్న "సంస్థాన కాంగ్రెసు"ను బలహీనపరచు ఉద్దేశ్యంతో కుక్కగొడుగులవలె అనేక సంస్థలు బయలుదేరుతున్నాయి. సంస్థాన ప్రజల కన్వెన్షన్; తిరువాన్కూరు సంస్థాన ప్రజల ఫెడరేషన్; తిరువాన్కూర్ నేషనల్ కాంగ్రెసు యిట్టిలే. తిరువాన్కూరు సంస్థానంలో ప్రభుత్వంయొక్క నిరంకుశ పరిపాలనకు గురియైన "సంస్థాన కాంగ్రెసు" మతసంస్థ అనియు; ప్రజలను దౌర్జన్యాలకు పురికొల్పేదనియు, కాంగ్రెసు సిద్ధాంతాలకు భిన్నంగా వ్యవహరిస్తూన్నదనియు పైవారి వాదన. కాని, వీరు, వట్టివాదనలే చేస్తున్నారుగాని, ఆ వాదనల కెట్టి ఆధారము లున్నవో నిరూపించలేకున్నాము.

#### బాధ్యతాయుత ప్రభుత్వము.

తిరువాన్కూరు సంస్థాన ప్రజలకు, సంస్థానాధీశ్వరుని యాజమాన్యాన్ని, బాధ్యతాయుత ప్రభుత్వం ఈయుటను గురించి సంస్థాన శాసనసభలో కాంగ్రెసు సభ్యులు ఎడ్జరన్‌మెంటు తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఇప్పటి నిబంధనల కిది వ్యతిరేకం కాబట్టిన్ని, సంస్థానాధీశ్వరుని అనుమతి లేకుండా నిబంధనలలో మార్పులు చేయకూడదు కాబట్టిన్ని, యీ తీర్మానంపై చర్చ జరుగకూడదంటూ దివాన్ రూలింగు యిచ్చాడు.

#### "రౌడీ రాజ్యం"

తిరువాన్కూరు "సంస్థాన కాంగ్రెసు"లో సుప్రసిద్ధ నాయకులైన మాధవ వరియార్ (ఎడ్వొకేట్), థామస్ మాత్యూ (మలబార్ ఎడ్వొకేట్ అను పత్రిక సంపాదకుడు), మిస్. ఎన్నామ్మ్యాస్‌కారినీ (ఎడ్వొకేట్), కె. వి. పరమేశ్వర్ నాయర్, నీలకంఠపిళ్ళె అను వారిపై పట్టపగలు తుంటరులు దౌర్జన్య మొనర్చుట, కె. కె. గంగాధర్ మీనన్, మిస్. ఎన్నామ్మ్యాస్ కారినీగార్ల యిండ్లలో దొంగతనాలు మొదలైన విషయములను గురించి చర్చించుటకు తన్ను పిళ్ళెగారు ఎడ్జరన్‌మెంటు తీర్మానం ఉపపాదించారు. ఆయన యీ విధంగా ఉపన్యసించారు :

"ఈ దౌర్జన్యాలు, యీ దొంగతనాలు గవర్నమెంటుకు చాలా అవమానాన్ని తెచ్చిపెడుతున్నాయి, పోలీసులు నేరస్థులను పట్టుకొనలేకపోయారని గవర్నమెంటే అంగీకరించింది. దాన్నిబట్టి సంస్థాన పోలీసులు వట్టి దద్దమ్మలని బోధపడుతుంది. నేడుంగడలో జరిగిన ఒక సభకు నేనువెళ్ళాను. అది స్టేట్ కాంగ్రెస్ యాజమాన్యాన్ని జరిగింది. అక్కడ రౌడీలను పోలీసులు ప్రోత్సహించుటే గాక, పురిగొల్పినట్లు నేను చూచాను. కాంగ్రెసు పద్ధతులు గవర్నమెంటు కిష్టంలేకపోతే, న్యాయమైన మార్గములద్వారా దాన్ని అణచవచ్చును. అంతేగాని, నేటి పరిస్థితులే ముందుకూడా ఉంటే నిజమైన రౌడీ రాజ్యమే ఉన్నదని చెప్పాలి"

తీర్మానాన్ని బలపరుస్తూ, తరియత్తుకుంజీ తోమస్ అనే పేరుగల కాంగ్రెసేతర సభ్యుడు తిరువాన్కూరు ప్రభుత్వాన్ని "గూండా రాజ్యం" (అనగా తుంటరుల రాజ్యం) అని పిలిచాడు. తీర్మానం చర్చించబడరాదని దివాన్ రూలింగు యిచ్చాడు.

చెంగన్నూర్‌లో యీమధ్య జరిగిన బహిరంగ సభలో పోలీసులు చేసిన లాఠీఛార్జిని గురించి చర్చించుటకును, సభలు, ఊరేగింపులు జరుగరాదని క్విలోన్, కొట్టయాం జిల్లా మేజస్ట్రేట్లిచ్చిన నిషేధాజ్ఞలను గురించి చర్చించుటకును ఎడ్జరన్‌మెంటు తీర్మానాలు ప్రతిపాదించగా వాటికికూడా అనుమతి ఈయబడలేదు.

#### సభను విడిచిపెట్టి వచ్చుట.

తిరువాన్కూరు పోలీసులు చేసిన యితర దౌర్జన్యాలను గురించిన మరొక తీర్మానంపై చర్చ జరుగుతోంటే, "సంస్థాన కాంగ్రెసు" తప్పకుండా రాజద్రోహకరమైన, వినాశకరమైన పనులు చేస్తూన్నదని దివాన్‌అన్నాడు. వెంటనే కాంగ్రెసు సభ్యులందరు శాసనసభా భవనమును విడిచిపెట్టి యీవలకు వచ్చారు. బయట ప్రజలు "గాంధీ-కి-జై" అనే కేకలతో వారిని సన్మానించారు. తీర్మానం ఓడిపోయింది.

ఈ విధంగా, ప్రజల పౌరసత్వ హక్కులను గురించి శాసనసభలో చర్చ జరిగిన నాలుగైదు రోజులు శాసన సభకు బయట అనేకమంది ప్రజలు గుంపులుగా చేరేవారు. ప్రభుత్వాన్ని సమర్థించిన శాసన సభ్యులను ప్రజలు గేలిచేశారు. కొందరు వారిపై రాళ్ల రువ్వారు. మరి కొందరు బురదతో కొట్టేవారు. దీని కంతటికీ "సంస్థాన కాంగ్రెసే" కారణమని కాంగ్రెస్ వ్యతిరేకులు శాసనసభలో ఆరోపణలు చేశారు. ఏ విధంగా? అని అడిగినప్పుడు జవాబు చెప్పలేక పోయారు.

(మిగతా 18 వ పేజీలో)

## విజ్ఞప్తి

**చందాలు-చెల్లించండి!**

ఇంతవరకునూ చందాకట్టని చందాదారులు ఈ నెలాఖరు లోపల చెల్లించనిచో పత్రిక ఆగస్టు నుండి పంపబడదు. చందాదారులు తమ చందాను వెంటనే చెల్లించి పత్రికకు సాయపడ వలసినదని ప్రార్థించుచున్నాము.

★

తంతివార్తల పంపేవారు "నవశక్తి" అని మాత్రం తంతినిస్తున్నారు. "నవశక్తి—వీక్లీ" అనిగాని, "నవశక్తి పేపర్" అనిగాని తంతి నీయవలెను. లేనిచో ఆలస్యము - ఇబ్బందీ అవుతుంది గాన గమనించ ప్రార్థన.

మేనేజరు,
నవశక్తి.
గవర్నరుపేట, బెజవాడ.

# నవశక్తి

20—7—38 బుధవారం

## కాంగ్రెసు రాజ్యంలో ఒక ఏడాది

అరు రాష్ట్రాలలో కాంగ్రెసు అధికారం స్వీకరించి సంవత్సరమైనది. కాంగ్రెసు పరిపాలన యొక్క రుచి కాస్త ప్రజలకు తెలిసివచ్చింది. సాంవత్సరికోత్సవాలు దేశమంతట వెల్లివిరిస్తున్నాయి. మన మదరాసు ప్రధాని ప్రస్తుతం ఆంధ్రరాష్ట్రంలో విజయ యాత్రను కొనసాగిస్తున్నారు.

కాంగ్రెసు రాజ్యం యేర్పడిన తర్వాత దేశంలో మొత్తంమీద ప్రజలలో కాంగ్రెసుయందు హెచ్చు అభిమానం కల్గింది. రాజకీయ ఖైదీలు విడుదల అయినారు. పౌరసత్వ హక్కులు చాలవరకు విస్తృతమయినాయి. రైతులకు కొన్ని స్వల్ప సౌకర్యాలు కూడా కల్గినాయి. మొత్తంమీద రాజ్యమేలుతున్నది మనవాళ్లే, కాస్త మనము ఊపిరాడించుకోవచ్చు నను భావము సర్వత్ర వ్యాపించింది.

మదరాసు రాష్ట్రాన్ని పరికిద్దాము. ఇప్పుడే వెలువడిన ఊటీబ్యాంకు, మదరాసు బాంబు ఖైదీల విడుదల ఆర్డరుతో రాజకీయ ఖైదీల విముక్తి పూర్తియైనది. రైతు ఋణనివారణ చట్టము, మద్యపాన నిషేధచట్టము. చేనేత పనివారల రక్షణ చట్టము, మాప్లా చట్టమును రద్దుచేయడము, యీ నాల్గు చట్టములను నిశ్చితముగా కాంగ్రెసు మంత్రివర్గమువారి ఘన కార్యములని హృదయ పూర్వకముగా ప్రతిపౌరుడును అంగీకరింపక తప్పదు. కాని ఋణనివారణ చట్టము రైతుల ఋణములను తగ్గించుటకు ఉపకరించినా ఆ తగ్గింపబడిన మొత్తములను ఋణదాతలకు చెల్లించి ఋణవిముక్తు లగుటకు తగిన యేర్పాటు లేనందున పూర్తిగా సార్థకము కాలేదు. ప్రస్తుతము బొంబాయి కాంగ్రెసు ప్రభుత్వము వారీలోటును సవరింపబూనుకొన్నారు. ఋణములలో నూటికి 30 వంతున కొట్టివేసి మిగిలిన మొత్తాన్ని వెంటనే ఋణదాతలకు చెల్లించివేయుటకు 6 కోట్ల రూపాయలను ప్రత్యేకించుచున్నారు. ఇప్పుడైనను మించిపోయినది లేదు. వెంటనే మదరాసు ప్రభుత్వమువారు అట్టి యేర్పాటును చేయుటకు పూనుకొనవచ్చును.

రైతులకు పన్ను బాధలేమియు మదరాసు ప్రభుత్వము వారు తగ్గింపలేక పోయారు. రీసెటిలుమెంటు అదనపు రేట్లను ప్రభుత్వము వారు రద్దు పఱచినా వెనుక జస్టిసు ప్రభుత్వమువారు కూడా ఆ పన్నును నిజముగా వసూలుచేసి యుండలేదు. అందుచే రైతులకు సంతృప్తి కలుగలేదు. ఎస్టేటు లాండు ఆక్టును సవరించుటకు జమిందారీ విచారణ సంఘము నియమింపబడి విచారణను పూర్తిజేసినా యింతవరకు రిపోర్టు అయినను తయారు కాలేదు. ఈలోగా జమిందారుల దౌర్జన్యాలు మితిమీరిపోతున్నాయి. కమిటీ ఎదుట సాక్ష్యమిచ్చిన వారి తలలు పగిలిపోతున్నాయి. దావాలు, డిక్రీలు, జప్తులు జోరుగా సాగిపోతున్నాయి.

కార్మిక శాసనం యింకా పూర్తికాలేదు. అందలి సూచనలు కార్మికుల ఏకైక హక్కగు సమ్మెహక్కును సైతము భంగపరచు చున్నది. బొంబాయి ప్రభుత్వం వారు కూడా యిదే పద్ధతులపై కార్మిక బిల్లును తయారు జేశారు. చీరాల కాల్పులు, హార్విలు నివేదిక, మదరాసు ప్రభుత్వము వారి సమర్థనము కార్మిక లోకాన్ని కలవర పరచినాయి. కాంగ్రెసు ప్రభుత్వానికిది తీరని కళంకమని ఆంధ్ర రాష్ట్రి కాంగ్రెసు సంఘమువారు ప్రభుత్వ చర్యను విమర్శించి కాంగ్రెసు వర్కింగు కమిటీ వరకు వెళ్లవలసి వచ్చింది. కాన్పూరు సమ్మెను యు. పి. కాంగ్రెసు ప్రభుత్వం వారు సవ్యముగా పరిష్కరించి ప్రతిష్ఠను గడిస్తే మదరాసు ప్రభుత్వము వారు చీరాల కాల్పులను సమర్థించి ప్రజలలో అలజడి కల్గించారు. విదురాశ్వద్ధం కాల్పుల గూర్చి మైసూరు ప్రభుత్వము చూపించిన స్వల్ప వైఖరినైనా మదరాసు ప్రభుత్వంవారు చూపలేకపోవుట శోచనీయము. కాల్పులల్లో చనిపోయిన వారి కుటుంబాలకు నష్ట పరిహారము నైనా మైసూరు ప్రభుత్వం ఇచ్చింది. కాని చీరాల బాధితులకు కాస్త పరిహారమైనా యివ్వలేదు మన మదరాసు ప్రభుత్వము. మైసూరు ప్రభుత్వంవారి కాల్పులకు బాధ్యులయిన ఉద్యోగస్తులను ట్రాన్స్ఫరైనా చేసింది. కాని రాజాజీ ప్రభుత్వం వారు ప్రజలు కోరినా వారిని ట్రాన్స్ఫరు చేయలేదు. సరికదా కాల్పించిన ఒంగోలు సబ్ కలెక్టరును జిల్లా కలెక్టరుగా జేసి ప్రమోషనిప్పించారు. "రాళ్ళ దెబ్బలకు గుండు దెబ్బలే సరియైన జవాబు" అను సిద్ధాంతమును ప్రకటించి పంజాబు దురంతముల సందర్భమున పోలీసులను సమర్థించిన ఆనిబిసెంటమ్మకు రాజకీయ రంగములో స్థానం లేకపోయింది. అదే సిద్ధాంతమును బహిరంగముగా చీరాల కాల్పుల సందర్భంలో సమర్థించిన రాజాజీని తన దృక్పథాన్ని మార్చుకొనేటట్లు చేయలేక పోయింది దేశం. మదరాసు ట్రాంవే కార్మిక వివాదాన్ని మాత్రం సవ్యంగా పరిష్కరించి అభినందనాలు పొందింది మదరాసు ప్రభుత్వం.

ఆంధ్రరాష్ట్రంపట్ల, రాయలసీమ కరవుపట్ల, తుంగభద్ర ప్రాజెక్టుపట్ల, ప్రభుత్వవైఖరి తీవ్రవిమర్శలకు గురియైంది. ఆంధ్రరాష్ట్రి విషయంలో ప్రధాన మంత్రిపై, బాధ్యతగల నాయకుల విమర్శలు కూడ హద్దుమీరినవని చెప్పక తప్పదు. ప్రస్తుత ఆంధ్రరాష్ట్రి యాత్రలో రాజాజీగారి విషయమై అనుమానాల కావంతయైన ఆస్పదం లేకుండా చక్కనిమాటలు శలవిచ్చారు. "ఆంధ్రరాష్ట్రం కోసం రాయబారం వెళ్ళాలంటారా నేనే మీకు ఉత్తమ రాయబారి" నన్నాడు. "మదరాసు శాసనసభా తీర్మానమును పంపుతూ ఆంధ్ర రాష్ట్రాన్ని నేను శిఫార్సుచేసితి"నని ఘంటాపథంగా చెప్పేడు. "నన్ను పెద్ద మనిషిగా భావిస్తారా, భావించరా" యని సవాలుచేశాడు. ఇంతటితో శంకలన్ని సమసిపోవాలని మనవి చేస్తున్నాం.

రాయలసీమ క్షామబాధితులకు సహాయం తగినంత కలుగలేదు. తుంగభద్ర ప్రాజెక్టు విషయమై రాజాజీ చెప్పినమాటలు ఆశాజనకంగా లేవు. విశాఖపట్నం మెడికలు కాలేజీ విషయం అధ్వాన్నంగానే ఉంది.

అన్నిటికంటె అన్యాయంగా ఉన్న విషయం పోలీసులపట్ల పెద్ద ఉద్యోగులపట్ల ప్రధానిగారి వైఖరి. పోలీసు జులం మితిమీరి పోతోందని ఆంధ్రరాష్ట్రి కాంగ్రెసు సంఘంవారు తమ మెమోరాండములో మొరపెట్టుకోవలసి వచ్చింది. లంచగొండితనం యథాప్రకారంగానే ఉంది. సి. ఐ. డీల ఆర్భాటాలు హెచ్చుగానే ఉన్నాయి. ఆలిండియా కాంగ్రెసు కమిటీ మెంబర్లపై కూడ సి. ఐ. డి. నిఘా తప్పుటలేదు. రాజకీయ సభలకు పోలీసు రిపోర్టు లింకా పోలేదు. అధికారం స్వీకరించగనే యు. పి. ప్రధాని గోవింద వల్లభ పంతు ఉద్యోగులకిచ్చిన హితోపదేశాన్ని, యీమధ్య సి. పి. ప్రభుత్వంవారు పోలీసులకు పంపిన సర్క్యులరును రాజాజీగారు బాగా మననం చేసుకోవాలని కోరుతున్నాము. రాజాజీగారి మంగుళూరు, తిన్నవల్లి, అనంతపురం ఉపన్యాసాలు చూస్తే పోలీసులకింక యీ రాజధానిలో పట్టపగ్గాలుండవేమో యని భయమగుచున్నది. "ప్రజలకు మీరు సేవకులు, యజమానులు కారు" అనే భావాన్ని పోలీసులకు, పెద్ద ఉద్యోగస్థులకు గాఢంగా నాటుకొనేటట్టు చెయ్యాలి.

విద్యార్థులు రాజకీయాలలో పాల్గొన కూడదనే జి. ఓ. వెంటనే రద్దుకావాలి. పుస్తకాలపై నిషేధం తీసివేయాలి. రష్యా విప్లవం అనే గ్రంథం కాంగ్రెసు ప్రభుత్వమే నిషేధించుట శోచనీయం.

తమ ఉద్యోగకాలంలో ఫలానా పనులు చేస్తామని వెంటనే ప్రకటించాలని ఆంధ్ర రాష్ట్రి కాంగ్రెసు సంఘంవారు చేసిన సూచనను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాం.

మొత్తము మీద కాంగ్రెసు పరిపాలన ప్రజలలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. ఆశాలతల వ్యాపింపజేసింది. ప్రజలు తమ హక్కుల కొరకై ఆందోళన చెయ్యాలని ఆశకొల్పింది. ఆ యాందోళన ఉంటేనే కాంగ్రెసు మంత్రులు చురుకుగా తమ కార్యక్రమాన్ని అమలు జరపగలరని రుజువైంది. కాన్పూరు సమ్మెయొక్క పాఠమిదియే. రాజకీయ బందీల విడుదల యెట్లు సాధింపబడినది గమనిస్తే ఇదే సత్యం గోచరిస్తుంది. రైతు ఋణ నివారణ చట్టాల వెనుక బలము కూడ ప్రజాందోళనమే. ఈ ప్రజాశక్తితో కాంగ్రెసు మంత్రివర్గాలింకా ముందుకు పోతాయని నమ్ముతున్నాము.



# ఫెడరేషన్‌లో సంస్కరణలు కోరటం దేశద్రోహమే!

## హరిపుర కాంగ్రెస్ తీర్మానాన్ని బలపరచండి!
## బోస్, నెహ్రూలకు చేయూత నివ్వండి!!
## సత్యమూర్తి, భూలాభాయిలను జారనీయకండి!

శ్రీ ప్రభల కృష్ణమూర్తి, బి. యస్. సి., బి. యల్.



"వర్కింగు కమిటీ కలుసుకో బోతున్నది. అప్పటిదాకా నాకు మూగ నోము."

భారతదేశ చరిత్రలో నేడు ఒక క్లిష్టదశ వచ్చినది. ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగా బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఫెడరల్ రాజ్యాంగ విధానాన్ని మన దేశములో అమలుపెట్టుటకు సర్వవిధముల ప్రయత్నించుచున్నారు. 1935 యిండియా గవర్నమెంటు చట్టము నంతయు నిర్మూలించి దానిస్థానే ప్రజాపరిషత్తు ద్వారా ఏర్పడు రాజ్యాంగవిధానమే భారతదేశ ప్రజల ఆశయమని కాంగ్రెసు తీర్మానించినది. కాంగ్రెసు ప్రభుత్వములున్న రాష్ట్రము లన్నిటియందును శాసనసభలు కూడ ఈ తీర్మానమును అంగీకరించినవి. ప్రజలందరు కూడ తమ ఆశయమును స్పష్టపరచినారు.

ఈ ఫెడరల్ రాజ్యాంగవిధానాన్ని మనము త్రోసిపుచ్చుటకు కారణములు మూడే ముఖ్యమైనవని తెలిపియున్నాము. కాంగ్రెసు నాయకులగు సత్యమూర్తిగారు, వీటిని మరుగుపరుచుటచే తిరిగి వ్రాయవలసి వచ్చినది. ఆకారణములు:

1. ఫెడరల్ విధానములో గవర్నరు జనరల్ కుంపు ప్రత్యేకాధికారములు; ఫెడరల్ శాసనసభకు ముఖ్యమైన అధికారాలు లేకపోవుట; యిప్పటికంటె ఎక్కువగా సామ్రాజ్యవాదుల అధికారాన్ని బలపరచుట.

2 బ్రిటిషు సామ్రాజ్యవాదుల మీద ఆధారపడి వారి దయాదాక్షిణ్యములద్వారా బ్రతుకుచూ, మన స్వాతంత్ర్య పోరాటములో ప్రజావిరోధులుగా పరిగణించబడిన (చారిత్రాత్మికముగా) సంస్థానాధీశులను యితర ప్రజాప్రతినిధులతో కలుపుట; మన ఫెడరల్ శాసనసభలో ప్రజావ్యతిరేక పక్షమును తయారుచేసి ప్రజల ఆశయములకు అడ్డముగా నుంచుట; బ్రిటిషు ఇండియా ప్రతినిధులను రాష్ట్ర శాసనసభలనుండి ఎన్నుకొనుట; యిప్పటి మోస్తరుగా ప్రజలచే తిన్నగా ఎన్నుకోబడకుండ చేయుట.

3. రాజ్యాంగ విధానము, ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగా ప్రజా సమ్మతిలేక, ప్రజాప్రతినిధులు పాల్గొనకుండ తయారు చేయబడినది. ఇది బ్రిటిషు సామ్రాజ్యవాదులచే మన మీద రుద్దబడిన రాజ్యాంగ విధానము అగుచున్నది.కాని, ప్రజా సమ్మతమయిన ప్రజాపరిషత్తు ద్వారా ఎన్నుకొనబడినది కాజాలదు. యిది మన రాచకీయ ఆశయములకు పూర్ణస్వరాజ్య దృక్పథమునకు విరుద్ధముగా నున్నది.

యీ పై మూడు కారణములలోను ముఖ్యమైనది ఏది అనే ప్రశ్నమీద సత్యమూర్తి—బోసు వాదము జరిగినట్లున్నది. జాతీయ కాంగ్రెసు యొక్క ఆశయము చూచినట్లయితే పూర్ణ స్వరాజ్యమని అందరికి తెలుస్తుంది. కాంగ్రెసు చరిత్ర చూచినట్లయితే, రాబోవునది తుది పోరాటమనియు, దానికి ప్రజల నందరిని తయారుచేయుట ప్రతి కాంగ్రెసు వాదియొక్క కర్తవ్యమనియు చెప్పవలసి వస్తున్నది. కాంగ్రెసు రాష్ట్రములలో మంత్రిత్వములను అంగీకరించు నపుడు కూడ వర్కింగు కమిటీ చేసిన తీర్మానములో ఈ రాజ్యాంగ విధాన ధ్వంసమే కాంగ్రెసు ఆశయమని తెల్పియున్నది. అట్టి సందర్భములో కొన్ని మార్పులకు ఫెడరల్ విధానాన్ని అంగీకరించ వచ్చుననుట ప్రజలను మోసగించుట తప్ప వేరు కాదు. సత్యమూర్తిగారు ఈ మధ్య బొంబాయిలో యిచ్చిన స్టేటుమెంటులో ఏ మోస్తరుగా ఫెడరల్ విధానాన్ని మారిస్తే వారు (అంటే సత్యమూర్తిగారు) ఒప్పుకొనెదరో చెప్పినారు. "సంస్థానములలో ఏదో ఒక విధమయిన స్వపరిపాలనము (సంస్థానాధీశుల యాజమాన్యము క్రింద), సైనిక శాఖ ఖర్చులో కొంత శాసనసభ చేతిలో నుంచుట (ఎంత?); రాష్ట్రములలో యిచ్చినట్లు, కేంద్రమున కూడా ఏదోవిధమగు అస్యూరెన్సు (మాట తప్పనని వాగ్దానము) యిచ్చుట." యిదంతా "అయోమయంగా" నున్నది.

"సంస్థానాధీశుల యాజమాన్యము క్రింద స్వపరిపాలన" అను వాక్యము పరస్పర విరుద్ధముగా నున్నది. సంస్థాన ప్రజలను మోసగించుటకు, ప్రజలలో ధనవంతులకు సంస్థానాధీశుని కంచముతోని ఎంగిలి మెతకులు నాలుగు వేయుటకు చేయబడిన కొచ్చిను స్వపరిపాలన చట్టము చూచియే యున్నాము. ఎంగిలి మెతుకుల కొరకే నా ప్రజల పోరాటము, త్యాగము, ధైర్యము, సాహసము? జమీందారీలతో బాటు, స్వదేశ సంస్థానములు కూడ నాశనమయి, హిందూదేశ ప్రజలలో ఒక భాగమునకు యింకొక భాగమునకు ఉన్న కృత్రిమ బేధములు తొలగించిననే కాని ప్రజలు సౌఖ్యపడరు. అట్టి ఆశయముననే ప్రజలు పోట్లాడువారు.

యింక, సైనిక శాఖావ్యయము సంగతి చూద్దాము. మన దేశమున, మన ప్రజల పోరాటమును అణచుటకై, మన ధనముతో, విదేశీయుల యాజమాన్యముక్రింద సామ్రాజ్యవాదుల చేతిలోని ఆయుధములుగా నున్న హిందూదేశ సైన్యముయొక్క వ్యయములో "కొంచెము" భాగము మీద మనకు అధికారమట! బ్రిటిషు సామ్రాజ్యవాదుల హక్కులను కాపాడుటకై చైనా దేశమునకు పంపబడిన మన సైనికుల విషయములో సత్యమూర్తి ఎం. ఎల్. ఎ. (సెంట్రలు) గారు, భూలాభాయి దేశాయిగారు చూపిన వైఖరిని ప్రతి సామ్రాజ్య వ్యతిరేకి ఖండించాలి. తిరిగి యిప్పుడు తన "కామ్రేడ్ భూలాభాయిని"సమర్థించుటకు సత్యమూర్తిగారు సాహసించినారు! కాని ప్రజలకు కావలసినది "కొంత" స్వతంత్రము కాదు; పూర్ణ స్వరాజ్యము. ఈ సైన్యమును పూర్తిగా రద్దుచేసి, ప్రజారక్షణ ప్రజలపైననే ఉంచవలెను. సాయుధ ప్రజలే తమ రక్షణకు తగిన వారు.

యింక "అస్యూరెన్సు" విషయము. ఈ అస్యూరెన్సుల విలువ యిప్పటికి ప్రతివానికి బయటపడినది. చిన్న విషయాలలో రాజీనామా యిచ్చిన గాని బ్రిటిషు గవర్నర్లు లొంగుటలేదు. (బీహారు, యు. పి. మంత్రుల రాజీనామా) వ్యావసాయిక చట్టములు (చాల బాధలవలన కృశించి పోవుచున్న రైతుల బాధను-ఒకఅప్పు మాత్రము తొలగించుటకు చేసినవి, చేయపూనినవి). కాంగ్రెసు మంత్రివర్గములు ఎంత పోట్లాటతో, ఎంత ప్రజా ఒత్తిడి వలన చేయవలసి వచ్చినదో గుర్తించినట్లయితే, కేంద్రమున సగానికి పైగా సామ్రాజ్య వాద సేవకులను కల్గిన శాసన సభలో ప్రజలకు సౌకర్యములొసగు చట్టములను చేయుటకు ఏమాత్రము వీలుండదని తేట తెల్లమగుచున్నది.

యింత వాదమెందులకు? మితవాద నాయకులు ప్రజల ముందర స్పష్టముగా చూపించని విషయము అన్నిటికంటె ముఖ్యమైనది. భారతదేశ ప్రజల ఫెడరల్ రాజ్యాంగ విధాన వ్యతిరేకత, పైవిషయములపైన నంతగా లేదు. తమ రాజ్యాంగ విధానమును తాము ప్రజా పరిషత్తు ద్వారా నిర్ణయించుటకు గల హక్కుయే వారి వ్యతిరేకతకు ప్రధాన కారణము. ఈ ముఖ్య విషయమునే దేశాయి, సత్యమూర్తిగార్ల నాయకత్వం క్రింద మితవాదులు మరుగుపరచుతున్నారు. బోసు-నెహ్రూగార్ల నాయకత్వముక్రింద అతివాదులు బయటపెట్టి ప్రజా ఆశయమును ప్రతిబింబించు చున్నారు! ఫెడరల్ రాజ్యాంగ విధానమును పూర్తిగా నాశన మొనరించి దానిస్థానే ప్రజాపరిషత్తుచే చేయబడు రాజ్యాంగ విధానమే ప్రజల రాజకీయ, ఆర్థిక బాధలను తొలగించుటకు తగునని అతివాదులు యిప్పటికి అనేక వేలసార్లు చెప్పియున్నారు. ఈ ప్రజాపరిషత్తును పొందుటకు పోరాటమే మార్గం. కాన్పూరులో మొన్న 50 రోజులు 50,000 మంది నేత కార్మికులు చేసిన పెద్ద పోరాటమే దీనికి ప్రత్యక్ష నిదర్శనము. మానవ జన్మకన్న అతి హీనముగానున్న పరిస్థితులను మార్చి కొంచెము కూలి హెచ్చుదలకై ప్రజాసంస్థ లన్నికలసి పోరాడినప్పుడే కాన్పూరు కార్మికులు జయాన్ని పొందగలిగిరి. ఒక కాన్పూరులోనే అటుల జరిగినప్పుడు యావద్భారతదేశ ప్రజల కోర్కెలను శాసన సభల ద్వారా యీడేర్చ కల్గుననుకొనుట భ్రమ కాని వేరొకటి కాదు, కాబట్టి ప్రజా పరిషత్తు కావాలంటే పోరాటం అవసరం, బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని, దాని ఆయుధములకు నిరంకుశాధికారాన్ని నాశన మొనరించి, ప్రజల దుస్థితిని బాపవలెనంటే, ప్రజా పరిషత్తు ద్వారా వచ్చిన రాజ్యాంగ విధానాన్ని అమలు పెట్టుటకు ప్రజలందరు పోరాడాలి. కాన్పూరు పోరాటము లాంటివి యింకా విరివిగా, తీవ్రముగా జరగాలి. అప్పుడే భారతదేశ స్వాతంత్ర్యోద్యమము కల్గునని ప్రజలందరు గుర్తించాలి.



"ఫెడరల్ విధానము ఆమోదించినచో అది కేవలము రాజకీయ హత్యగానే పరిగణింపబడును. అట్టి దురూహ్యమగు అవసరమేర్పడినపుడు మెజారిటీ పక్షమువారు దానినే స్వీకరించుటకు నిశ్చయించినచో, ఆ ఆత్మహత్యల జూదములో నేనుందునని న్యాయమాలోచించు వారెవరైన తలపెట్టగలరా?"

యీ క్లిష్ట పరిస్థితుల్లో ప్రతి కాంగ్రెసువాదికి స్పష్టముగా ఒకటే కర్తవ్యము. వివిధ ప్రజా సంస్థల ద్వారా ఫెడరల్ రాజ్యాంగ విధానము యొక్క బూటకత్వాన్ని పూర్తిగా ప్రజలకు బయటపెట్టి, ఖండించి, దానికి మారుగా ప్రజా పరిషత్తుకై ప్రజలలో ఆందోళన చేయవలెను. యిట్టి ప్రచారము మూలముననే, సత్యమూర్తి—దేశాయి — మొదలగు మితవాదుల కాలుజారుటను ఆపగలము. ప్రజాశక్తి ప్రజాభిప్రాయము, ప్రజాబలమే యిటువంటి మితవాద ధోరణిని మార్చునవి అని గుర్తించి వెంటనే ప్రచారము సాగించవలెను. కాంగ్రెసు కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, స్త్రీ సంఘాలన్నియు ఈ ప్రచారమున తీవ్రముగా పాల్గొనవలెను.

# ఆంధ్ర రాష్ట్ర కార్మికోద్యమం

## పరిశ్రమలు అభివృద్ధి కాలేదు
## ఉద్యమం ప్రారంభావస్థలో ఉంది

### ట్రేడ్ యూనియన్ ఉద్యమంపై సోషలిస్టుల తీర్మానం

**ఆంధ్ర రాష్ట్రంలో ట్రేడ్ యూనియను ఉద్యమం యొక్క ప్రత్యేక స్వభావం**

ఆంధ్ర దేశము వ్యవసాయ దేశము కావటము వల్లను, పెద్ద పెద్ద పరిశ్రమలు లేకపోవుటచేతను, కార్మికోద్యమము ఎక్కువ అభివృద్ధి చెంది తగినంత రాజకీయ శక్తిగా ఉండుటకు అవకాశములు తక్కువగా ఉన్నవి.

ముఖ్యమైన పరిశ్రమ రైల్వే. దాదాపు 20,000 మంది కార్మికులు పని జేస్తున్నారు. రైల్వే వర్కుషాపులు రాజమండ్రి, బెజవాడ, బిట్రగుంట, దొనకొండ, గుంతకల్లులో ఉన్నవి.

విశాఖపట్టణం జిల్లాలో నెల్లిమర్ల, చిట్టివలస జ్యూటు పరిశ్రమలో 5000 మంది కార్మికులు పని జేస్తున్నారు. ఏలూరులో ఒక జ్యూటు ఫ్యాక్టరీ యున్నది కాని అది ప్రస్తుతము పని చేయుటలేదు. గుంటూరులో ఉండిన ఫ్యాక్టరీ కూడ పోయింది.

బట్టల మిల్లులు పందలపాక (తూర్పు గోదావరి జిల్లా)లో ఉన్నవి. ఇచ్చట 800 మంది పని చేస్తున్నారు. ఈ వరకు బెజవాడకు సమీపంలో తాడేపల్లిలో ఒక మిల్లు యుండేది, పెద్దాపురంలో సిల్కు ఫ్యాక్టరీ ఒకటి ఉంది, చేతి మగ్గాలమీద పని చేస్తారు. గుంటూరు జిల్లా చీరాల పొగాకు ఫ్యాక్టరీలో 1000 మంది ఉంటారు. సీజను వచ్చినపుడు 5-6 వేలమంది పని చేస్తారు. పొగాకు ఫ్యాక్టరీలన్నీ గ్రామాలలోనే ఉన్నాయి. అవి సీజనులో మాత్రమే పని చేస్తుంటాయి.

చక్కెర ఫ్యాక్టరీలు ఉయ్యూరు, సామర్లకోటలలో ఉన్నవి.

బెజవాడ, ధవళేశ్వరములలో పి. డబ్ల్యు. డి. వర్కుషాపు లున్నాయి.

రాజమండ్రిలో పేపరు మిల్సు ఉన్నాయి. ప్రస్తుతం 200 మంది పని చేస్తున్నారు.

విశాఖపట్టణంలో హార్బరు వర్కర్లు 2000 మంది ఉన్నారు, కాకినాడ హార్బరు లేకపోయినా, తీరపు ఓడలు వస్తూ పోతూ ఉంటాయి. ఇచ్చట కూడ డాక్ వర్కర్లు ఉన్నారు.

నెల్లూరు జిల్లాలో అభ్రకపు గనులు, కడప కర్నూలు జిల్లాలలో రాతి (Granite) గనులు ఉన్నాయి. విశాఖపట్టణం జిల్లాలో మాంగనీస్ గనులున్నాయి.

చాలచోట్ల వేరుసెనగ నూనె మిల్లులు, బియ్యపు మరలు (మిల్లులు) ఉన్నాయి. 10 మొదలు 100 మంది కార్మికులతో నడపబడుతూ ఉన్నవి. అవికూడా అధికమైన పెట్టుబడిచేత నడుపబడుట లేదు, కాన ఫ్యాక్టరీలు స్థిరంగా వుండుటలేదు.

ఆంధ్ర రాష్ట్రములో ఉన్న మ్యునిసిపాలిటీలలో, దాదాపు విద్యుచ్ఛక్తిని నెలకొల్పుతున్నారు. అందుచే ఎలెక్ట్రిక్ కార్మికులను కూడ సంఘటన చేయవలసి ఉంటుంది.

మ్యునిసిపాలిటీలలో పాకి పనిచేసేవారు, వీధులను ఊడ్చేవారు, తదితర మ్యునిసిపలు వర్కర్లు చాలమంది ఉన్నారు.

తోళ్ళ పరిశ్రమ గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలో ఉన్నది. ఇచ్చటకూడ ట్రేడు యూనియనులు వృద్ధి పొందుతూ ఉన్నాయి.

పెద్ద పరిశ్రమ లున్నచోట్ల గొప్ప ట్రేడు యూనియనులను వృద్ధి పొందించడానికి అవకాశముంది. పట్టణాలలోఉన్న ఫ్యాక్టరీ పనివారలు, తోళ్ల పనివారలు, ప్రెస్ వర్కర్సును మ్యునిసిపలు వర్కర్సును సంఘాలుగా ఏర్పరచిన రాజకీయశక్తిగా కార్మికోద్యమం ఆంధ్ర రాష్ట్రంలో తయారవుతుంది. ఫ్యాక్టరీలలోను, యితర పరిశ్రమలలోను పనిచేయు కార్మికులు గ్రామాలలో నుండుటచేత రైతు దృక్పథము (Peasant Charactor) వదలలేదని జెప్పవచ్చును.

**ట్రేడు యూనియను సంఘటనయొక్క ప్రస్తుతస్థితి, ధానిబలము.**

యమ్. యస్. యమ్. రైల్వే పనివారల యూనియను బ్రాంచి 1929 సం.న బెజవాడలో ఏర్పాటుకాబడి పని చేయుచున్నది. యూనియనులో సభ్యత్వము ఎక్కువగా ఉన్నప్పటికి 1932 లో జరిగిన సమ్మె విఫలం అయినందున యూనియను బలహీనపడింది. 1936 లోనుండి అభివృద్ధి జెందుతూవచ్చి 1938 సం.లో, రాజమండ్రి, బిట్రగుంటలలో కూడ బ్రాంచీలు ఏర్పాటు చేయగల్గింది. సభ్యత్వం 2500.

డాక్ వర్కర్స యూనియను 1935 లో ప్రారంభమయింది. 1500 మంది సభ్యులుండేవారు. కార్యదర్శి తప్పుడు పద్ధతులవల్ల యూనియను బలహీనత జెందుతూ వచ్చింది. ప్రస్తుతం సభ్యత్వం 800.

నెల్లిమర్ల జ్యూటు వర్కర్స యూనియను 1932 లో ఏర్పాటుకాబడి 500 మంది సభ్యులు ఉన్నారు. చిట్టివలస యూనియను 1933 లో ఆర్గనైజుకాబడి 200 మంది సభ్యత్వం ఉండేది. చిట్టివలస కార్మిక కాంగ్రెసు సంఘంగా మార్చబడి ప్రస్తుతపు సమ్మెను సాగిస్తూఉంది. సభ్యత్వము 2000 దాకా అభివృద్ధి జెందింది.

చీరాల పొగాకు ఫ్యాక్టరీ యూనియను 1937 లో స్థాపించబడి, 3000 సభ్యత్వము ఉండేది. సమ్మె సందర్భంలో కాల్పుల ఫలితాన యూనియను సభ్యత్వం తగ్గింది.

సామర్లకోటలో చక్కెర, అబ్కారీ, ఫ్యాక్టరీ కార్మికుల యూనియను నామమాత్రముగా ఉంది.

ఆంధ్రరాష్ట్రంలో ప్రెస్‌వర్కర్స యూనియన్లు తెనాలి, గుంటూరు, బెజవాడలలో 1935 లో స్థాపించబడినాయి. మొదటినుండి సోషలిస్టుల నాయకత్వం క్రిందనే ఉండుటచేత వారిలో రాజకీయ పరిజ్ఞానము హెచ్చు. ఆంధ్ర రాష్ట్ర ప్రెస్‌వర్కర్స యూనియను సభ్యత్వము 500.

ముఖ్యమైన పరిశ్రమలలో ఉన్న ట్రేడు యూనియను లన్నియూ, సంస్కరణవాదుల (Reformist) చేతులలో ఉండుటచేత పోషరిష్టుల తగ్గినంత పని చేయులేక పోవుట చేత వర్గ కలహం మీద ఆధారపడిన ట్రేడు యూనియను చైతన్యము కూడ సరిగా లేదని చెప్పవచ్చును. కొన్ని పట్టణాలలో మాత్రమే కొద్దిమంది పార్టీ సభ్యులు, ట్రేడు యూనియను పనిని ప్రారంభించి నప్పటినుండి ఆ ప్రదేశాలలో నైన ఇట్టి చైతన్యాన్ని కలుగ జేయగలిగాము.

**చేసిన పనులు - లోపాలు**

ఆంధ్ర దేశములో, కూలీ సంరక్షణ సంఘం ద్వారా కార్మికుల మధ్య పని జేయడం ప్రారంభించాము. అప్పుడే గుంటూరు, తెనాలి, బెజవాడ ప్రెస్ వర్కర్స యూనియనులను ఏర్పాటు జేశాం. విశాఖపట్టణంలో మనము హార్బరు వర్కర్స యూనియనును ఏర్పాటు చేశాము. అధ్యక్షుడుగా ఉన్న సంస్కరణ వాదితో సహకార పద్ధతితో పని జేయటానికి బదులుగా, ఆయన నాయకత్వాన్ని తొలగించటానికి యూనియనును కూడ భగ్నం గావించేటంత సంకుచిత పద్ధతులను, కొందరు సభ్యులు అవలంబించడము మూలంగా, యూనియను సభ్యులమధ్య పలుకుబడి, సంబంధంపోయింది. అప్పటినుండి చేసిన పొరపాట్లను సవరించుకొని, ఐక్య సంఘటనను దృష్టిలో పెట్టుకొని పని సాగించడం వల్ల, నాయకత్వం మరియొకరి చేతులలో ఉన్నప్పటికీ యూనియను సభ్యుల మధ్య సోషలిస్టులకు పలుకుబడి హెచ్చి, ట్రేడు యూనియను రోజు రోజుకు తీవ్ర దృక్పథం అవలంబిస్తూ ఉంది. (మిలిటెంటు అవుతూ ఉంది.)

రైల్వే యూనియను సంస్కరణ వాదులలో ఉన్నప్పటికి పార్టీ సభ్యులు రైల్వే కార్మికుల మధ్య పని జేశారు. మన పార్టీ సభ్యులు పని జేయడం మొదలుపెట్టి నప్పటినుండి యూనియను అభివృద్ధి జెంది, బెజవాడ బ్రాంచి క్రింద రెండు సబ్ బ్రాంచీలు ఏర్పాటు చేయగల్గింది. వారిలో తగినంత రాజకీయ చైతన్యం వృద్ధి పొందక పోయినా, ట్రేడు యూనియను చైతన్యం ఎక్కువయింది. ప్రతి వర్కుషాపు ఉన్న ప్రదేశాలలో సభ్యులు పనిజేసి ఉండినా మిలిటెంటు యూనియన్లుగా అభివృద్ధి చేయగలిగే వారం. గుంటూరు జిల్లాలలో పొగాకు కార్మికుల మధ్య కొద్ది నెలల నుండి పనిజేయ ప్రారంభించాము. చీరాల సమ్మెనుండి సభ్యులు పనిజేసిన ఫలితంగా ఆ యూనియనులో కూడ స్థానము సంపాదించ గలిగాం.

జనపనార పరిశ్రమ, బట్టల మిల్లుల పరిశ్రమ కార్మికుల మధ్య పనిచేయులేదు. ఫ్యాక్టరీ కార్మికులమధ్య తెనాలిలో తప్ప మిగిలిన స్థలాలలో పనిజేయలేదు. ఎక్కువ జిల్లాలలో మోటారు డ్రైవర్సు యూనియను ఏర్పాటు అయినప్పటికి వానిలో పార్టీసభ్యులు, పశ్చిమ గోదావరి, కర్నూలులలో తప్ప, ఎవరూ పని జేయుటలేదు. గుంటూరు జిల్లా మోటారు డ్రైవర్సు యూనియను పార్టీ సభ్యుల ప్రోత్సాహం సహాయాలమీద ఏర్పడినా పార్టీసభ్యులు వారితో సంబంధము ఉంచుకొనక పోవడము వల్ల యూనియను పనిజేయుటలేదు. ఆంధ్ర రాష్ట్ర ప్రెస్‌వర్కర్స యూనియనును ఏర్పాటు జేసి ప్రతి ముఖ్యపట్టణములో యూనియనులను ఏర్పాటుజేశాము. బెజవాడ, తెనాలి, ఏలూరులో ప్రెస్ వర్కర్సులో రాజకీయ చైతన్యము అభివృద్ధి జెందినది. ట్రేడు యూనియనును పని జేయుచున్న పార్టీ సభ్యులు చాల కొద్దిమంది. మొత్తముమీద నిర్లక్ష్యము చేశామని చెప్పవచ్చును.

**మన కర్తవ్యము.**

1. కార్మిక సంఘం, కార్మికుల వర్గపోరాటమును నడుపు సంస్థ. మరియు కార్మికులు సోషలిజముకోసం పోరాడడానికి తరిఫీదు రంగము. కార్మిక వర్గపార్టీకి, కార్మిక వర్గబలము ముఖ్యము. ఆంధ్ర దేశములో కార్మిక వర్గము నుండి పార్టీలోనికి సభ్యులురానిదే పార్టీ కార్మిక స్వభావము పొందదు. (ప్రొలిటేరియనైజు కాదు.) పార్టీని ప్రొలిటేరియనైజు చేయడానికి ట్రేడు యూనియన్సు చాల ముఖ్యము. కార్మికులు రోజురోజు జరుపు పోరాటము ద్వారా తమ హక్కులు సంపాదించ ప్రయత్నిస్తారు. సోషలిజము వచ్చేదాక తమ పూర్తిహక్కులు రావని గుర్తించి సోషలిజము స్థాపించడానికి కార్మికవర్గ పార్టీ అవసరమని గ్రహించి పార్టీలోకి వస్తారు.

2. కాన ట్రేడు యూనియను పనియందు ఎక్కువ శ్రద్ధ వహించాలి. కార్మికుల రాజకీయ చైతన్యము, వారు రోజురోజుజరుపు పోరాటము వల్లనే అభివృద్ధి జెందుతుంది. యజమానులు వారి శ్రమశక్తిని దోపిడి జేయు అన్ని ప్రయత్నాలను ఎదుర్కొని పోరాటము సాగించవలసి ఉంటుంది. సంఘాలు ఏర్పాటుగాని పరిశ్రమలలో ట్రేడు యూనియనులును ఆర్గనైజు చేయడము మన ముఖ్య కర్తవ్యము కావాలి. నామ మాత్రమే ఉన్న ట్రేడు యూనియనులను వృద్ధిజేసి కార్మికుల పోరాటాలను నడుపుటకు పార్టీ పూనుకోవాలి. ఆంధ్ర దేశములో పెద్ద పెద్ద పరిశ్రమలలో పనిజేయు కార్మికులు రిఫార్మిస్టుల పలుకుబడిలో ఉన్నారు. రిఫార్మిస్టు దృక్పథమునుండి కార్మికులను మరల్చడానికి వారి నాయకత్వములో నున్న ట్రేడు యూనియనులలో కూడ పార్టీ సభ్యులు పనిజేయాలి. కార్మికుల దైనందిన కష్టాలలో పాల్గొంటూ వారి వర్గ సంఘములను వృద్ధి పరచుచూ, పోరాటాన్ని ముందుకు తీసుకపోవాలి. వర్గ పోరాటము తీవ్రపడుచున్న కొలది రిఫార్మిస్టు నాయకులు కూడ ముందుకు రావాలని ఉంటుంది. స్టడీసర్కిల్సు, రాత్రిపాఠశాలలు ద్వారా కార్మికులకు తగిన తరిఫీదు యిచ్చి వారిలో నుండి పార్టీలోకి సభ్యులను తీసుకపోవాలి. ఈవిధంగా పార్టీలోకి వీరు వచ్చినపుడు ప్రస్తుత పార్టీ సభ్యులకు నేడు మిగిలియున్న పెట్టీ బూర్జువా వాసనలు (ప్రిజుడిసెసు) పూర్తిగా పోతాయి.



3. కార్మికులకు గల్గు చిన్న యిబ్బందులనుకూడ తీసుకొని ఆ యిబ్బందులను తొలగించుటకు తీవ్రమైన కృషి జేయాలి. వారి యొక్క తాత్కాలిక కోర్కెల కొరకు ఆందోళన చేయాలి, ప్రతి పరిశ్రమలోను, పనిజేయు కార్మికుల తాత్కాలిక కోర్కెలను, కార్మికులు చెప్పురోజు రోజు కష్టాలను ఆధారం జేసుకునే తయారు జేయాలి. వారందరి చేత అంగీకరించబడ్డ ఆ సామాన్య కోర్కెలను సంపాదించుటకు వారివర్గ సంఘాల్లోనికి వారికి తీసుకొని రావాలి. అన్ని పరిశ్రమలలో పనిజేయు కార్మికులకు, సంబంధించిన యీ కనీసపు కోర్కెలకు, వారిని క్రోడీకరించి ఉద్యమము ముందుకు తీసుకోవాలి.

(1) 8 గంటలకు మించని పని.
(2) కనీసము 25 రు. జీతం.
(3) నిరుద్యోగ భీమా, ముసలితనములో పెన్‌షన్సు.
(4) సంవత్సరమునకు ఒకనెల జీతంతో శెలవు
(5) ఉచిత గృహము, ఉచిత వైద్య సహాయము.
(6) 14 సం॥ లోపలవారిని ఫ్యాక్టరీ పనిలోకి తీసుకో కూడదు. తీసుకోవడం దండనార్హము చేయాలి.
(7) గర్భిణీ స్త్రీలకు జీతంమీద రెండు నెలలు సెలవు.
(8) సమ్మె చేయడానికి, పికిటింగు జేయడానికి హక్కు.
(9) యూనియనులను గుర్తించాలి.
(10) వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము.
(11) కార్మికులకు, వారి పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యాలు.
(12) కార్మిక తగాదాల చట్టాన్ని రద్దు చేయాలి.
(13) "వేతనాల ఆక్టు" (పేమేంటు ఆఫ్ వేజెస్) లోని మోడీ సవరణను రద్దు చేయాలి.
(14) ఫాక్టరీ యాక్టు ప్రతి 5 గురు పని జేయు కార్ఖానాకు వర్తించేటట్టు జేయాలి.

4. కార్మికుల హక్కులను కార్మిక వర్గానికి జెందని యితర ప్రజా సామాన్యములో కూడ ప్రచారం జేయాలి. కార్మిక పోరాటాలను యితర ప్రజా సామాన్య పోరాటాలను, సమన్వయం జేసి ఉద్యమం నడిపితేగాని జాతీయ ఐక్య సంఘటనను నిర్మించలేము. జాతీయ ఐక్య సంఘటనకు పునాది అయిన, కాంగ్రెసు కమిటీలు, కార్మికుల కనీసపు కోర్కెలు, సామాన్య పౌరసత్వ హక్కులు కాన కార్మికుల పోరాటంతో సంబంధం కలుగ జేసుకొనేటట్లు జేయాలి.

అంటే కార్మిక సమ్మెలను కాంగ్రెసు బలపరిచి ఆందోళన సహాయము గావించేటట్లు తీసుకరావాలి.

వెంటనే పార్టీ ఈ క్రింది సూచనలను ఆచరణలో పెట్టాలి.

(1) ప్రతి జిల్లాలో ఒక పార్టీ సభ్యుడు రైల్వే కార్మికుల మధ్య పని జేయాలి.

(2) జిల్లాలో ఇతర ట్రేడు యూనియను పని కోసం తగినంత మంది పార్టీ సభ్యులను వినియోగించాలి.

(3) రాష్ట్ర పార్టీ ఒక లేబరు సబ్‌కమిటీని ఏర్పాటు చేయాలి.

(4) లేబరు సబ్‌కమిటీకి ట్రేడు యూనియను ఉద్యమము మీద అవసరమైన సారస్వతమును, విషయాలను అంద జేయాలి.

(5) ప్రతి జిల్లానుండి ట్రేడు యూనియను పనికి నియమించిన పార్టీ సభ్యుడు ఆఫీసుకు రిపోర్టులను ప్రతినెలా పంపాలి.

# తూర్పు గోదావరి జిల్లా
# ఆర్థిక రాజకీయ పాఠశాల

## రాజమండ్రి

### ప్రారంభోత్సవం జయప్రదముగ జరుగుట

జూలై 15 వ తేది పాఠశాల ప్రారంభోత్సవం జరిగింది. పుర వీధులగుండా ఊరేగింపు జరిపి దానవాయిపేటలోని ఉచిత పఠనాలయం వద్ద చేరారు. ఇచటనే సాయంత్రం 4-30 గంటలకు నగర కాంగ్రెసు అధ్యక్షులు దేవతా శ్రీరామమూర్తిగారి అధ్యక్షతక్రింద బహిరంగ సభ జరిగింది.

**పరిచయం**

పాఠశాల ఆర్గనైజరుగారగు శ్రీ పుసులూరి కోదండరామయ్యగారు, పాఠశాల ఆశయాలను గురించి తెల్పారు.

**సి. ఐ. డి. ల బాధ**

అధ్యక్షులగు శ్రీరామమూర్తిగారు మాటాడుచు, కాంగ్రెసు హయాంలో, బహిరంగం సభలకు సి. ఐ. డి. లు హాజరు గావడం ఆశ్చర్యమని, కాంగ్రెసు మంత్రిత్వముతో ఈ పీడ వదలిందనుకుంటే వదల లేదనీ, తాము లెజిస్లేటివ్ కౌన్సిలులో ఈ విషయం ప్రశ్న వేస్తామని, ప్రధానిగారు వచ్చినపుడు ఈ విషయం మాటాడుతామనియు చెప్పారు.

ఇంకా కాంగ్రెసు క్రమం కుంటు వడకుండా ఉండాలంటే యువకులు గావాలని, ఆలాంటి యువకుల తయారు చేయడానికి పాఠశాల పూనుకొంటున్నదని, దేశాభిమాను లందరూ ప్రోత్సహించాలని తెల్పారు.

**దేశానికి అవసరం**

అరవ ఆదినారాయణ మూర్తిగారు మాటాడుచూ "ఇలాంటియువకులు దేశానికై ముందుకు రావడం, 50 సంవత్సరాల కాంగ్రెసు కృషి" అనీ, "ఆర్థిక రాజకీయ పాఠశాలలో తయారైన యువకులు నలు మూలల వందలాది జాతీయ వీరులను తయారు చేయాలనీ" చెప్పారు.

**సామ్రాజ్య వ్యతిరేకం పోరాటం పెంపొందుతుంది**

తర్వాత, పాఠశాల ప్రధాన అధ్యాపకులగు సి. వి. కృష్ణరావుగారు మాటాడుతూ, పాఠశాలయొక్క అవశ్యకత, కార్యక్రమాన్ని తెల్పారు. మంత్రి పదవులను స్వాతంత్ర్య పోరాటాభి వృద్ధికై యుపయోగించుకోవాలనీ, అందుకై, రాజకీయ విజ్ఞానంగల స్వాతంత్ర్య యోధులను తయారు చేయాలనీ, ఇందు నిమిత్తమే పాఠశాలలనీ తెలియజెప్పారు. రాజకీయ విజ్ఞానాన్ని, కార్యాచరణతో సమన్వయింపచాలనీ, ఆచరణలో లేని జ్ఞానం వ్యర్థమనీ, ఉద్యోగాలు చూపక పోయినా ఈ విద్య, నిరుద్యోగానికి మూలమైన సామ్రాజ్య వాదాన్ని రూపుమాపడానికి పనికి వచ్చే స్వాతంత్ర్య యోధులను తయారు చేస్తుందని తెల్పారు.

**కొత్తపట్టణం స్మరణ**

సభలో సి. ఐ. డి. లను చూస్తే కొత్తపట్నం జ్ఞాపకం వస్తుంది. అంటూ త్రోవ్విడి లింగరాజు గారుపన్యాసం ప్రారంభించారు. భారత రాజకీయాలను ప్రపంచ రాజకీయాల నుండి వేరుచేయజాలం గనక రాజకీయ విజ్ఞానం కల్గడానికి ఇలాంటి పాఠశాలలు ప్రతి జిల్లాలో స్థాపించాలని లింగరాజుగారు తెలవిచ్చారు.

**సోషలిస్టులుంటే?**

ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రిన్సిపాల్‌గారగు విస్సా అప్పారావుగారు తరువాత మాటాడుచూ సోషలిస్టు పార్టీవలన, కాంగ్రెసులో చీలికలు వస్తూ ఉన్నవని అనుకోడం పొరపాటనీ, స్వార్థపరులెవరూ లేరుగనుక, సోషలిస్టు లున్నారని రాజకీయ పాఠశాలను నిరుత్సాహ పరచరాదని చెప్పారు.

**మంచి అవకాశం**

తరువాత మద్దూరి అన్నపూర్ణయ్యగారు మాట్లాడిరి.

"కొత్తపట్టణం, మంతెనవారిపాలెం పాఠశాలలు సోషలిస్టుపార్టీ యాజమాన్యమున జరగడం వల్ల రాజమండ్రి పాఠశాలకూడ అసంబంధమైనదేనని అభిప్రాయ పడుతున్నట్లు కనిపిస్తుంది. సి. ఐ. డి. రిపోర్టర్లు యీసభ కింత తప్పనిసరిగా రావడానికి కారణమదే ననుకొంటాను. కాని నాకు తెలిసినంతవరకు కొంత మంది సోషలిస్టులు వ్యక్తిగతంగా యిందు పాల్గొంటున్నా దానికి పార్టీ యాజమాన్యము లేదు.

గత రెండు జాతీయోద్యమాల సమయంలో జెయిళ్లు రాజకీయ విజ్ఞానాభివృద్ధికి పాఠశాలలుగా ఉపయోగించాయి. కాంగ్రెసు మంత్రివర్గంలో జెయిళ్ళ ప్రాప్తికి అవకాశాలు తక్కువయి, రాజకీయ పాఠశాలలు పెట్టుకొనుటకవకాశము హెక్కువ అగుటవల్ల దీన్ని మనం పూర్తిగా ఉపయోగించుకు తీరాలి."

తరువాత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు డా. పట్టాభిగారు పాఠశాల విజయాన్నికోరుతూ వ్రాసిన పుత్తరం చదువబడెను.

తరువాత శ్రీ వెన్నేటి సత్యనారాయణ, మార్ని సుబ్బారావుగారు, న్యాపతి సుబ్బారావు పంతులు, చి. సత్యనారాయణాచార్య గారలు స్కూలు యొక్క ఆవశ్యకతను గురించి మాట్లాడిన పిమ్మట అధ్యక్షుని అంత్యోపన్యాసంతో సభ ముగిసెను.

**విజ్ఞప్తి**

నేటినుండి పాఠశాల క్రమపద్ధతిని సాగుచున్నది. జిల్లా వివిధ ప్రాంతాలనుండి 45 గురు విద్యార్థులు వచ్చియున్నారు ఇందు స్త్రీలు గూడ గలరు. ఇంకను రావలసిన విద్యార్థులు గలరు. వివిధ ఉద్యమాలలో పని చేయుచున్న ప్రముఖులను రప్పించి ఉపన్యాసాలిప్పించుటకు ప్రయత్నాలు జరుగుచున్నవి. అనేకమంది వచ్చుటకు వాగ్దత్తము చేసియున్నారు.

ఇదిగాక పట్టణములోని విద్యార్థులకు ఇతర పురజనుల ఉపయోగార్థము ప్రతి దినము సాయంకాలం 5 గంటలు లగాయతు 7 గం॥ల వరకు కాంగ్రెసు భవనములో వివిధ విషయాలపై ఉపన్యాసా లేర్పాటు చేయబడినవి.

రాజమండ్రి } పెన్మెత్స సూర్యనారాయణ,
16—7—38. } పబ్లిసిటీ సెక్రటరీ.

**రామచంద్రపురం తాలూకా రైతు సంఘం**

రామచంద్రపురం తాలూకా రైతు సంఘము 6 తేదీన సమావేశమై ఆలమూరు శెక్షను ఓవర్సీరుపై వచ్చిన పిటీషన్ల విచారించుటకు ఉపసంఘమును నియమించుటనుగూర్చియు కపిలేశ్వరపురం జమీందారు దుబ్బులనుపెంచి కొత్త లంకలను పెంచుటవల్ల పాత లంకలకు నది ఒడ్డు భూములకు నష్టము కల్గుచున్నది గాన తగుచర్య తీసికొనవలసినదిగా ప్రభుత్వమును కోరుచును, మరికొన్ని తీర్మానములను ప్యాసు జేసెను.

* * *

**బెజవాడ తాలూకా రైతు సంఘం**

బెజవాడ తాలూకా కాంగ్రెసు సంఘము 6వ తేదీన సమావేశమై జమీందార్లు మొఖాసాదార్లు అడవులను తమ ఇష్టులకు సాగుకిచ్చి రైతుల హక్కులకు భంగం కల్గజేయుచున్నారు గాన ఆపవలసినదనియు, లంచగొండి తనమును మాన్పుటకై వాటరీ రీడింగును ఇర్రిగేషన్ పంచాయితీల కివ్వవలెననియు, పసుపు సాగుకై జనవరిలోనే దరఖాస్తులు పంపుకోవాలన్న విషయం రైతులకు తెలియకపోవుటచే ఆగస్టు వరకు పెంచవలసినదనియు ప్రభుత్వమును కోరుచు తీర్మానించిరి.

**చెర్వుకొమ్ముపాలెం రైతులు**

కృష్ణాజిల్లాలో చింతలపాటి వంతు జమీందారు, చెర్వుకొమ్ముపాలెం గ్రామంలో అనాది నుండి చెర్వులో తట్టు భూములలో రైతులు పశువులు మేపుకొనుచున్న హక్కును అరికట్టుటకుగాను దొంకలకు అడ్డంగా కంపపాతిన్ని, పశువుల నీళ్ళకుపయోగించే కుంటను తన నౌకరుకు సాగుకిచ్చిన్నీ, బాధిస్తున్నారు. దొంకలోపోవు పశువులను జమీందారీ నౌకర్లు అడ్డగించుచు దౌర్జన్యం చేస్తున్నారు. దీన్నిగూర్చి రైతులు పిటీషను పంపుకోగా సబ్-యిన్స్పెక్టరు వచ్చి విచారించి జమీందారుతోనే చెప్పుకోండి అని సలహాయిచ్చి వెళ్ళినారట.

## అబ్బా! ఏమిటీ అశాంతి!!

అబ్బా! ఏమిటీ అశాంతి!! ఏమిటీ హత్యలు—ఏమిటీ బాంబులు—అంటూ కల్లోలపడతారు. పాలస్టయిన్ వార్తలు చూస్తూంటే.

పాలస్టయిన్ 'అల్లరు'లను గురించి చెప్పేటప్పుడు దాని పూర్వ చరిత్ర త్రవ్వాలి.

### పూర్వ చరిత్ర.

మహాయుద్ధంలో అరబ్బులు బ్రిటన్ ఫ్రాంసులకు సహాయం గావించారు. తురుష్క సామ్రాజ్యం నుంచి విడిపోయిన రాజ్యాలకు స్వాతంత్ర్యం ఇస్తామని బ్రిటన్, ఫ్రాంసులు ప్రకటించాయి. తర్వాత చిన్న రాజ్యాలకు రక్షణ ఈయాలంటూ మహాయుద్ధానంతరం జాతిసమితి 'మాండేటు' పద్ధతి సృష్టించింది. దాని ఫలితంగా బ్రిటన్ క్రిందకు వచ్చింది పాలస్టయిన్. కాని అరబ్బులు స్వాతంత్ర్య ప్రియులు. బ్రిటిష్ వారినీ, వారు దిగుమతి చేసే యూదులనూ ద్వేషించుతూనే వచ్చారు.

1920 లో మాండేట్ పద్ధతిని నిరశిస్తూ, జఫా, జరూసలంలలో తిరుగుబాట్లు జరిగాయి. 1923 లో ఎన్నికలను 'బాయకాట్' చేశారు. 1929లో మళ్ళా కొట్లాటలు ప్రారంభ మయాయి. ఇలా తిరుగుబాట్లు జరుగుతూ వచ్చాయి.

### విప్లవ వజృంభణం.

1936లో ప్రారంభమయాయి కలహాలు. అరబ్బులు జనరల్ స్ట్రైక్ చేశారు. ఆ సమ్మెలో దౌర్జన్యం బాగా చెలరేగిపోయింది. సెప్టెంబరులో మార్షల్ లా ప్రకటింప బడింది. 12 వేల బ్రిటిషు సైన్యాలు ఈ 'అల్లరు' ల అణచడానికి పోయాయి. అక్టోబరులో జనరల్ స్ట్రయిక్ అంతమయింది. 1937 జూన్‌లో బ్రిటిష్ ప్రభుత్వం ఒక రాయల్ కమీషన్ పంపించింది. ఆ కమిషన్ పాలస్టయిన్‌ను యూదులకు కొంత, అరబ్బులకు కొంతా విభజించాలని సూచించింది.

అరబ్బులు దీన్ని తీవ్రంగా విమర్శించారు. వీరికి వట్టి పనికిమాలిన — పంటపండని - చవిటి భూముల నిచ్చారని తీవ్రంగా నిరశించారు.

అప్పటినుండీ, తమ దేశంలో దిగుమతి అయిన యూదులే దీనికి కారణమని, పీడితులగు అరబ్బులు తలచ సాగారు. వారి క్రోధాన్నంతా యూదులపై దౌర్జన్యంతో సాధించ సాగారు.

ఈవారం వార్తలన్నీ, యూదుల — అరబ్బుల సంఘర్షణలనే తెల్పుచున్నాయి. బాంబుల వేయడం, కత్తులతో పొడవడం, టెలిగ్రాఫ్ తీగెల గోయడం, రాళ్ల రువ్వడం-ఇదీ మామూలుగా జరుగుచున్న పని.

### బ్రిటన్ క్రూరవైఖరి.

ముఖ్యంగా హైఫా, జెరూసలం, జాఫా, మొదలైన ప్రదేశాలలో ఈ ఘటనలు జరుగుచున్నాయి. "అల్లరులను" అపడం అనే వంకతో అరబ్బులను-స్వాతంత్ర్య యోధులను ఉరిదీస్తున్నారు బ్రిటిష్‌వారు. శాంతిని కాపాడటం అనే మిషతో, తుపాకుల కెరజేస్తున్నారు అరబ్బులను. ప్రతిచోటా కర్ఫ్యూ ఆర్డరు ఉంది: ఈజిప్టునుండి ఇతర ప్రదేశాలనుండి బ్రిటిష్ సైనికు లనేకుల్ని పాలస్టయిన్‌లో దింపారు.

పాలస్టయిన్‌లో, యూదులకు — అరబ్బులకూ తగాదాల కల్పించిన బ్రిటన్ వైఖరి ఖండిస్తూ హిందూదేశంలో కొందరు ముస్లిం నాయకులు తీర్మానం గావించారు. పాలస్టయిన్ గుణపాఠం హిందూదేశ మహమ్మదీయ మత తత్వవాదుల కళ్లతెరిస్తే, ఎంతో బాగుపడతాం....

# నేటి ప్రపంచం

## రెండేండ్లు బ్రతికిన స్పైన్

ఈమధ్యనే మన దేశంలోను, చైనాలోను, చైనా యుద్ధ వార్షికోత్సవం జరిగింది. ఇపుడు స్పైన్ యుద్ధ వార్షికోత్సవం. స్పైన్ యుద్ధం రెండేళ్లుగడిచి మూడవ సంవత్సరం లోకి వచ్చింది. ఒక్కసారి స్పైన్ యుద్ధాన్ని సింహావలోకనం చేద్దాం.

### సింహావలోకనం.

1936 జులై 18వ తేదీన మొరాకోలో తిరుగుబాటు ప్రారంభమయింది. మొత్తం మీద స్పైన్‌లో ఎక్కువ ప్రదేశం నేడు విద్రోహులే కల్గి ఉన్నారు. ఫ్రాంకో, ఇటలీ జర్మనుల సహాయంతో యుద్ధ సామగ్రిని పొందగలిగాడు. మనుష్య సహాయాన్ని పొందాడు. "నాన్ ఇంటర్వెన్షన్" రిపబ్లిక్‌కు సహాయం చేయకపోగా అన్యాయమే చేసింది. తిరుగుబాటును అణచివేయడానికి ఆయుధాలే లేకుండ పోయినవి. ప్రభుత్వానికి.

ఇక ఫ్రాంకో విజయం తప్పదా? స్పెయిన్ త్వరలోనే ఫేసిస్టుల చేతిలో పడుతుందా? అనేదే ప్రశ్న. ఏరోజుకారోజు వార్తలు చదివేటప్పుడు, "ఇక స్పెయిన్ పని అయిపోయింది. ఫ్రాంకో జయిస్తాడు." అంటూ అనేకసార్లు అనుకొన్నాం. కాని ఒకసారీ అలా జరుగలేదు.

మొదటి తిరుగుబాటు ప్రారంభించినపుడు, సైన్యాలన్నీ విద్రోహుల పక్షాన్ని చేరుచున్నపుడు, 15 రోజుల్లో స్పెయిన్, ఫ్రాంకో చేతిలోకి వస్తుందనుకున్నాం. 1936 నవంబరులో మాడ్రిడ్ వశంగావడం. కొద్ది గంటల్లో అని, అనిపించింది. 3 నెలల క్రితం మాడ్రిడ్, వలన్షియాలనుండి, 'కాటలోనియాల'ను విడబడ జేసినపుడు, ఒకటి రోజుల్లో స్పెయిన్ పోతుంది అని భావించాం.

కాని వీటిలో ఒక్కటీ జరగలేదు. స్పైన్ ఓడిపోలేదు! స్పైన్ ఫ్రాంకోకు పాదాక్రాంతం కాలేదు!! స్పానిష్ ప్రజల అకుంఠితదీక్ష, ధైర్య సాహసాలు, ఫ్రాంకోను ఆపగల్గినాయి. మనలను — ప్రపంచాన్ని విస్మయ పఱచినాయి. గత ఏప్రియల్‌లో "యుద్ధం పూర్తిఅయిందని" ఫ్రాంకో గర్జించాడు. కాని యుద్ధం కనీసం ఇంకొక సంవత్సరమైనా తప్పదు, అనిఇప్పటి భావన.

### ప్రస్తుత స్థితి

నేడు మాడ్రిడ్, బార్సిలోనాలలో కూడా తిండి పదార్థాలు తక్కువగు చున్నట్లు వార్తలు వస్తున్నాయి. ఆహార పదార్థాలు సప్లయిజేసే నౌకలపై ఫ్రాంకో బాంబులు వేస్తున్నాడు. కాని బ్రిటన్ నోరుమెదపదు. పైగా ఛాంబర్లేను ఫ్రాంకోనే సమర్థించాడు, బాంబుల వేయడం అన్యాయమో కాదో చూడ్డానికి, నావల ముంచడం గురించి విచారించడానికి కూడా "అంతర్జాతీయ" కమిటిలనైనా వేయమని ఛాంబర్లేను ప్రకటించేడు.

ఇక ఆయుధాలు, సైన్యాలు ముసోలినీ బాగా విద్రోహులకు సహాయం చేస్తున్నాడు. కాని రిపబ్లిక్ మాత్రం నోరు తెరచుక కూచోవలసి వస్తుంది. బ్రిటన్ ఫాసిస్టులకు లొంగింది. అమెరికానుంచి వచ్చే ఆశ పోయింది. ఫ్రాంసుకూడ సప్లయిచేయకుండ నిరోధింప బడింది. రష్యా కాస్త సహాయం చేస్తున్నా, భూగోళ పరిస్థితుల ననుసరించు ఆలస్యమూ, అవరోధమూ కల్గుచున్నది.

ఇలా రిపబ్లిక్ ప్రభుత్వానికి ఆయుధాలు లేవు — ఆహార సామగ్రిలేదు — బయటి దేశాల సహాయం నిరోధింపబడింది — నాన్ ఇంటర్వెన్షన్ పేరిట ద్రోహం జరిగింది. అయినా స్పైన్ ఓడిపోలేదు! ఓడిపోదు!! ఇదీ భావన.

### వలంటీర్ల సమస్య

స్పైన్‌లోని విదేశ వలంటీర్ల సమస్యపై ఒక ఒడంబడికకు వచ్చాయి అన్నిదేశాలు. కొన్నిచోట్ల వలంటీర్లను ఆయా దేశాలకు పంపడానికి కేంద్ర స్థలాలు నిర్ణయించారు. ఆస్థలాలకు వలంటీర్లను జేర్చుతారు. ముఖ్యమైన స్థలాలు, లండన్, హాంబర్గ, జినోవా, మార్సిలెస్, లిస్బన్.

రోజుకు రెండువేల మందిని "విత్‌డ్రా" చేస్తారట! కనీసం 164 రోజులు పడుతుందట. చివరి 46 రోజుల్లో గాయపడినవారు, జబ్బుపడ్డవారు పోతారు.

కాని ఈ "విత్‌డ్రాయల్" వల్ల లాభం ఏమైనా జరుగుతుందా? అపుడే స్పెయిన్ రాయబారి, "ఇటాలియను లెవరూ పోకుండా, రోగులనూ, గాయపడిన వారినీ పంపి, తక్కినవారు స్పెయిన్ దుస్తులలో ఉంచుతారనీ" తెల్పాడు. ఇటలీ దానిని హాస్యాస్పదమని నిరాకరించింది. కాని ప్రస్తుత పరిస్థితులు అవలోకించితే ఇటలీ వదలిపెట్టదు.

### విద్రోహుల జయం.

సాగంటో. టెరూల్‌మార్గం గుండా ఫ్రాంకో విజయ యాత్రలు సాగిస్తున్నాడు. వలన్షియా వైపు దృష్టి నిల్పాడు. రిపబ్లిక్ ఎంత పోరాడినా, ఆధునిక యంత్రాలముందు నిల్వలేక పోతున్నది. వలన్షియా పట్టుబడితే, మాడ్రిడ్‌కు, దక్షిణాన ఉండే రిపబ్లికన్ ప్రదేశాలకూ, ఏ వస్తువలూ సప్లయి అవడం కష్టం. కార్టిజెనానుండి సప్లయి చేయవచ్చుగాని ఎంతో అవస్థ పడాలి.

## చీనా—జపాను యుద్ధం.

ఈమధ్యనే చీనా పీపిల్సు పొలిటకల్ కౌన్సిల్ జరిగింది. అందులో అన్నిజాతుల రాజకీయ కక్షల ప్రతినిధులున్నారు. ప్రస్తుత ప్రభుత్వంపైన తమ విశ్వాసాన్ని వెలిబుచ్చారు.

కాంటన్‌పై బాంబులు దినదినమూ పడుతూనే ఉన్నాయి. హాంకోపైగూడ విమానాలుతిరిగాయి. షాన్సీ రాష్ట్రాన్ని మళ్ళా పట్టుకోవాలన్న చైనా ప్రయత్నాలు విఫల మయాయి.

మంచూరియా సరిహద్దులు దాటారని రష్యాపై అసమ్మతి తెల్పుతూ జపాను నోటు పంపింది. యుద్ధం వలన 10 లక్షలదాకా జపాన్‌లో నిరుద్యోగు లయారు. ఈసమస్య జపానును బాధించుతున్నది.

## బ్రిటన్ యుద్ధ సన్నాహాలు

1940 నాటికి వాయువిమానాల సంఖ్య 2370 వరకు చేయాలనీ, 230 లక్షల పౌన్లు ఖర్చుపెట్టాలనీ బ్రిటన్ నిశ్చయించుకొన్నది. కన్నడాలో కూడ, యుద్ధ విమానపు ఏర్పాట్లు గావించడానికి బ్రిటన్ ఒక జట్టును పంపుతూంది. డిఫెన్సుమంత్రి, ఒకచోట ఉపన్యసిస్తూ "మనం స్వరక్షణలో దేనికీ తీసిపోము. అన్నీ ఉన్నాయి." అని చెప్పాడు.

## ఆస్ట్రియాలో అలజడి

జర్మనీ ఈమధ్య యూదులపై తీవ్రదండయాత్ర సాగించింది. ముఖ్యముగా ఆస్ట్రియాలో దోపిడీలు, కూనీలు, పట్టాలు లాక్కోడం, నిరుద్యోగుల చేయడం గాక, కాన్‌సెంట్రేషన్ క్యాంపులలో పెట్టింది. పారిపోదామన్నా వీలులేకుండ ఉన్నది వారిస్థితి. వారిఆస్థుల లాక్కోవద్దని "టైమ్సు" పత్రిక జర్మనీని అడుగుతున్నది. ఈయూదుల రక్షణకై ఒక అంతర్జాతీయా సభ జరిగింది. మళ్ళా అగస్టులో లండన్‌లో మరో సభ జరుగుతుంది.

నిర్బంధంగా రెండేళ్ళ మిలిటరీ సర్వీసు ఆస్ట్రియాలో హిట్లర్ ప్రవేశపెట్టాడు. ఇది దాదాపు 22 ఏండ్ల వయస్సు గలవారికి వర్తిస్తుంది. ఆస్ట్రియా, నాజీ పైశాచిక కృత్యాల రుచిని ఇప్పుడిపుడే చూస్తోంది.



# పాలస్టయిన్ దురంతాలకు బ్రిటనే కారణం

## అరబ్బుల స్వాతంత్రోద్యమం విజృంభిస్తోంది

శ్రీ కస్పా వాసుదేవరావు

### ఆయుపు పట్టు.

హిందూ దేశములోవలెనే "నాగరికత రక్షణ" అనే మిషలతో సామ్రాజ్య వాదాల చేతుల్లో "బ్రిటిష్ సంరక్షణ" క్రింద (Br. Protectorate) ఉంది పాలస్టయిను. ఆర్థికంగా హిందూ దేశం బ్రిటిషు వారికెంత లాభకరమో యుద్ధ ప్రయత్నాలకి పాలస్టయినంత లాభకరం. పడమట సూయజు, మధ్యధరా సముద్రం, ఈజిప్టులను; తూర్పున ఇరాకు దేశమందలి తమ సంపదలను రక్షించుట కొరకును; హిందూదేశాని వచ్చుటకు నేల, సముద్ర వాయుమార్గాల్లో ముఖ్య ప్రదేశము అవుటచేతను, బ్రిటిషు ప్రభుత్వం పాలస్టయినును విడికిటినుండి విడువకున్నది.

తురుష్క సామ్రాజ్యం చితికిపోయిన తర్వాత పాలస్టయిను విషయం పారిసు శాంతి మహా సభలోకి వచ్చింది. తక్కిన చిన్న చిన్న దేశాలవలెనే పాలస్టయిను కూడా సంపూర్ణ స్వాతంత్ర్యం కలుగుతుందని భ్రమ పడింది. ప్రెసిడెంటు విల్సను 14 పాయంట్లు లాభసూచకంగా ఉన్నయి. పైగా 1918 నవంబరు 30 లో అరబ్బులు చేసిన సహాయానికి ప్రతికూలంగా బ్రిటిషువారు ఫ్రెంచి వారు కలసి తురుష్క సామ్రాజ్యం నుంచి విడివడిన రాజ్యాలకి సంపూర్ణ స్వాతంత్ర్యం యిస్తామని ప్రకటనచేశారు.

### రక్షిస్తామని భక్షించారు.

కాని సామ్రాజ్య వాదుల కోర్కెలకి, వారి భయాలకి అంతం లేదు. 5 కోట్ల 55 లక్షల అరబ్బులు కలసి మళ్లీ ఎప్పటికైనా యూరపియనుల సామ్రాజ్యవాద కోర్కెలు భంగం చేస్తారని తేనె పూసిన కత్తివంటి 'మాండేటు పద్ధతి' (Mandate System) నొకదాన్ని సృష్టించారు.

ఈ మాండేటు పద్ధతి నానా జాతి సమితి నిబంధనలో (Covenant of the League of Nations) లో 22 వ అర్టికలు. అందులో ఇలా ఉంది. "యుద్ధానంతరం పరరాజుల చేతులనుండి విడిపోయిన రాజ్యములింకను వెనుకబడి తమ ప్రజలను రక్షించుకొనుటకు శక్తి లేకపోవుటచే నాగరకతకల్గిన సామ్రాజ్య వాద దేశములు, ఆ చిన్న దేశములలోని ప్రజలకు శక్తి వచ్చేవరకు వాటిని పరిపాలించుటకు సహాయము చేయుచుండవలయును. సహాయము చేశే దేశములు పరిపాలింపబడే దేశ ప్రజల అనుమతి మీదనే సహాయానికి పూనుకోవలెను". నానా జాతి సమితి (League of Nations) తెరల వెనకాల జరిగిన మంత్రాలకి ఫలితమిది.

ఇలా అర్థ రక్షణానికి బయలు దేరిన ఫ్రాన్సు దేశానికి సిరియాలో ఎంత గౌరవముందో బ్రిటిషువారికి పాలస్టయినులో అంతే ఉంది. రక్షించడానికి బయలుదేరిన బ్రిటిషువారు ప్రపంచంలో నానామూలల్ని ఉన్న యూదులను పాలస్టయినులో దింపి దేశ సంపదల్ని దోచుకుంటున్నారు.

### యూదుల దిగుమతి

1900 సంవత్సరానికో ఒక లక్ష మంది పాలస్టయినులో చేరుకున్నారు. కొద్దిమందే కాబట్టి ఎప్పుడు కావలసొస్తే అప్పుడే వెళ్ళగొట్టొచ్చనుకున్నారు అరబ్బులు. కాని యుద్ధానంతరం యూదులను బ్రిటిషువారు రక్షించి వాళ్ళ ఆస్తి పాస్తులు వృద్ధికావడానికి సహాయము చేయడము మొదలుపెట్టిన తర్వాతే పోట్లాటలు బయలుదేరినయి. బ్రిటిషువారు పాలస్టయినును చేతులో ఉంచుకోడానికి పైన చెప్పినవేకాక యింకో కారణముంది. యూదుల నాయకుడైన డాక్టరు వైజ్‌మన్ బ్రిటిషువారికి యుద్ధసమయంలో గొప్ప సహాయం చేశాడు. కఱ్ఱనుండి ఆల్కహాల్ తయారు చేయడం వైజ్‌మన్ కనిపెట్టి ఇంగ్లీషువారి యుద్ధ ప్రయత్నాలను తేలికచేశాడు. ప్రతిఫలంగా బ్రిటిషువారు "యుగాండా"ను యిస్తామంటే వైజ్‌మన్ ఒప్పుకోక పాలెస్టయినే కావలెనని పట్టుపట్టాడు.

బ్రిటిషువారు పాలస్టయిను ప్రజలకి చేసిన మోసము ఇంకొకటి ఉంది. 1917 నవంబరు 2 లో బ్రిటిషువారు చేసిన బాల్ఫరు ప్రకటననుసరించి పాలస్టయినును యూదులకు (National Home) మాతృదేశముగా చేసినా అరబ్బులకు ఏవిధమైన కష్టము కల్గించకూడదు.

### అరబ్బుల తిరుగుబాట్లు

కాని రోజు రోజుకు పరిస్థితులు విషమించి పోతున్నయి. బ్రిటిషు ప్రభుత్వం చేతుల్లోకి పాలస్టయిను వచ్చిన దగ్గిరనుంచి దేశంలో తిరుగుబాట్లు వృద్ధి అవుతూ ఉన్నయి. మాండేటు పద్ధతి స్థాపించడానికి 1920 లో హెర్‌బర్ట్ సామ్యూల్‌వస్తే జరూజెరు సెలమ్‌లో తిరుగుబాట్లు జరిగినవి. 1923 లో ఎలక్షన్లలో అరబ్బులు ఓటుచేయక బ్రిటిషురక్షణకి తమ అసమ్మతి తెలియజేశారు. తరువాత వచ్చిన లార్డు ప్లూమరు తెలివితేటలతో వాగ్దానాలుచేసి వాటిని నెరవేర్చకుండానే 1929 లో ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడు. రాజీనామా యివ్వగనే తిరిగి కొట్లాటలు ప్రారంభమయినవి. కాని వాటిని అణిచివేయడానికి బ్రిటిషు మర తుపాకుల కెంతోసేపు పట్టలేదు. ఈ అల్లరుల గురించి కామన్సులో ప్రశ్నిస్తే లార్డుపాస్‌ఫీల్డు యూదుల దిగుమతితగ్గిస్తామని మాటయిచ్చాడు. అంతే. యూదులు రావడము మానలేదు. అరబ్బుల "అల్లరులు" మానలేదు.

### సామ్రాజ్య విస్తీర్ణం.

సూయజ్, పెర్షియన్ గల్ఫ్, మధ్యధరా సముద్రములను రక్షించడానికి పాలస్టయిను. పాలస్టయినును అరేబియానుండి రక్షించుకోడానికి మీస్, అకాబాలు, పాలస్టయినులో తిరుగుబాట్లణచడానికి ట్రాన్సు జోర్డానులోని, ఏరోడ్రోములు, వీటన్నిటి మీదా ఒక కన్నుంచడానికి ఈజిప్టు—ఇలా అల్లుకుపోయింది మధ్యధరా సముద్రం చుట్టూ బ్రిటిషు సామ్రాజ్యవాదం. మధ్యధరా సముద్ర ప్రాంతాన ఉన్న దేశాల మీద ముసోలినీ కన్ను మొదటనించీ ఉంది. ఇస్లాం మతాన్ని రక్షిస్తానని ముసోలినీ వేసిన కేక పాలస్టయినులో ముసోలినీకి ఏజంట్లను తయారు చేసింది. పాలస్టయినుక్కూడా అబిసీనియా గతే పడుతుందేమో!

### విజృంభించుతున్న విప్లవం.

పాలస్టయినులో యూదులు అనేక వేల పౌన్లు వ్యాపారంలో పెట్టారు. రెడ్‌సీలోని పొటాషు, ఎలక్ట్రికల్ మాగ్నేట్లు, సారవంతమైన భూములు యూదుల చేతుల్లో ఉన్నవి. అరబ్బులలో చాలమంది రైతాంగమే. దేశంలో 6 అరబ్బులకు ఒక యూదు చొప్పున ఉన్నారు. ఉభయుల్లోని కర్షకులకు బ్రిటిషువారిపై ద్వేషం అపరిమితంగా ఉంది. కాని ఉద్యమం సరియైన మార్గంలో కేంద్రీకరింప బడలేదు. విడివిడిగా తిరుగుబాట్లు జరుగుచున్నవి. క్రింది తరగతులలో ఉద్యమం ఒక మతస్థుల కింకొక మతస్థుల మీద ద్వేషంగా పరిణమించిందని కూడా చెప్పొచ్చు.

తమకు పాలస్టయినులో చోటు దొరకదని బ్రిటిషు ప్రభుత్వానికి తెలియగానే వుడ్‌హెడ్ కమీషన్‌ను పంపారు. పాలస్టయిను విభాగాన్ని తీర్మానించింది కమీషన్. కామన్సు వాగ్దానాలు చూస్తే త్వరలో తేలేటట్టే ఉంది వ్యవహారం. ఎలా అయినా బ్రిటిషువారు మాత్రం పాలస్టయినులో ఒక ముక్క అయినా నిలబెట్టుకుంటారు గాని పూర్తిగా వదలిపెట్టరు. ప్రపంచ యుద్ధమే వస్తే బ్రిటిషువారి మీద ఎదురు తిరిగే దేశాల్లో పాలస్టయిన్ ఒకటి అవుతుంది.

## చైనా సైనికుల ప్రత్యేక సౌకర్యాలు

### ఇంటి అద్దె లేదు—డాక్టరు ఫీజు లేదు—చదువు సంధ్యలకు జీతాలు లేవు.

జపానుకు వ్యతిరేకంగా మాతృదేశ రక్షణార్థమై పోరాడే చైనా సైనికులకూ - ఆఫీసర్లకూ ఈ క్రింది ప్రత్యేక వసతులను ప్రభుత్వం కల్పించింది.

(1) జపానుదాడి నెదుర్కొంటూ పోరాడుతున్న సైనికుల కుటుంబాల యొక్క ఆర్థికస్థితి ఎలాఉందో మాటిమాటికీ స్థానిక ప్రభుత్వం విచారించి "రికార్డు" చేయాలి.

(2) జపానుతో పోరాడు సైనికులు తాము సర్వీసులో ఉండగా ఈక్రింది లాభాలను పొందుతారు.

(a) ప్రతి సైనికునకూ - అతని కుటుంబానికీ పన్నులు ఉండవు.

(b) పబ్లిక్ బిల్డింగులలో కాపురముంటే అతని కుటుంబం బాడుగ చెల్లించనక్కరలేదు.

(c) పబ్లిక్ దుకాణలలో కొనే వస్తువులలో, సైనికునికిగాని అతని కుటుంబానికిగాని నూటికి 1 చొ॥ తగ్గించి అమ్ముతారు. ఏదైనా వస్తువులు మార్కెటులో తక్కువగా నున్నపుడు ముందు సోల్జర్లకు ఇస్తారు.

(d) రైలులోగాని, స్టీమరులోగాని ప్రయాణంచేస్తే టిక్కెటుకు డబ్బు చెల్లించనక్కరలేదు. పబ్లిక్ ట్రెజరీ చెల్లించుతుంది.

(e) సైనికుని పిల్లలకు స్కూళ్ళల్లో జీతాలుండవు.

(f) జబ్బువల్లగాని, యుద్ధంలో గాయపడితేగాని, అతనికి ఉచిత వైద్యసహాయం ఇస్తారు.

(3) (5) ఏండ్లు సైన్యంలో పనిచేసి, 45 ఏండ్లు దాటినవారు రిటైరుగావచ్చు: విశ్రాంతి తీసికోవచ్చు: తక్కిన జీవితం అంతా గడపడానికి పబ్లిక్ ట్రెజరీ పెన్షన్ ఇస్తుంది: లేక వారు రిటైరు గాకుండా విశ్రాంతి తీసికోకుండా, పని చేస్తామంటే వారికి ప్రత్యేక సౌకర్యాలు ఉంటాయి.

5. యుద్ధంలో తమ ప్రాణాల బలిగావించినట్టి గాని, లేక సర్వీసులో ఉండగా జబ్బుచేత మరణించినట్టి గాని, సైనికుల గురించి ప్రభుత్వము చేయు పనులు.

(a.) ఆ సైనికుల వీరకృత్యాలు, చనిపోయిన స్థలమూ, కాలమూ, ప్రభుత్వము ప్రకటిస్తుంది.

(b.) అతనికి సంబంధించిన సామగ్రినంతా ప్రోగుచేసి విప్లవ చారిత్రక ప్రదర్శన శాలలో ఉంచుతుంది.

(c.) వారి అంత్యక్రియల ఖర్చులు స్థానిక ప్రభుత్వం భరిస్తుంది. ఇంకా స్మారక చిహ్నం కూడా నెలకొల్ప బడుతుంది.

6. సైనికులు చనిపోయినా, అంగవైకల్యం పొందినా, వారి కుటుంబాలీ క్రింది సౌకర్యాలు పొందుతాయి.

(a.) వారి పిల్లలు, తమ్ములు, చెల్లెండ్రు 18 ఏండ్ల దాకా ఫీజు చెల్లించకుండా చదువుకోవచ్చు. 18 ఏండ్లు వచ్చాక ఉద్యోగానికి ప్రభుత్వం రికమెండు చేస్తుంది.

(b.) సైనిక కుటుంబాలకు పూర్వం గ్రాంటుచేసిన అన్ని సౌకర్యాలూ అనుభవింపవచ్చు.

7. అంగ వికలురైన సైనికులు "శానిటోరియం"లకు పోవచ్చు. వారి ఖర్చులన్నీ ప్రభుత్వమే పోషిస్తుంది. వారు శానిటోరియంలో ఉండటానికి ఇష్టం లేకపోతే 10 సంవత్సరపు "పెన్షన్ల"లను ప్రభుత్వం,వారి జీవితాంతం వరకు ఇస్తుంది.

★ ★ ★

ఇవన్నీ చైనా ప్రభుత్వం ప్రకటించి, ప్రకటించిన నాటినుండి ఆచరణలోకి పూనుకొన్నది. ఈ ప్రకటన "ప్రత్యేక పరిపాలిత జిల్లాల"కై ఉద్దేశింప బడింది. తమ సోదరులతో లేక తమకేమీ సంబంధం లేనివారితోనో పోరాడి యుద్ధభూమినుండి తిరిగి వచ్చిన ఘన భారత సైనికునకు, పట్టభూమి—నిరుద్యోగం గతి! చూడండి ఎంత వ్యత్యాసమో చైనా భారతదేశ సైనికులకు!

# జమీందారీ విధానం నశించాలి — అంటూ జమీన్ రైతుల ఘోష

## ఆంధ్ర దేశంలో రైతు వుద్యమ పరిణామం

### భూమి ఆక్రమణలు — 144, 107 సెక్షన్లు—దౌర్జన్యాలు

## గంపలగూడెం

(1) ఆంజనేయపురం తాళ్ళ చెరువులోని నీరును ఆ చెరువుక్రింద పల్లం సాగుచేయు రైతుల మామూలు పల్లం భూములకు యివ్వక జమీందారు గారి స్వంతకమతము భూములు వున్న గోపాలదావు చెరువులోనికి తాళ్ళ చెరువులోని నీరును తీసుకొని వెళ్ళు నిమిత్తం కాల్వ వేయుచుండగా, రైతులు ప్రభుత్వోద్యోగులకు తెలుపుకొనగా అచ్చట గల్లంతులు జరుగకుండా కాపాడుటకు పోలీసు కాపలా వేయబడినది.

(2) రహదారి వెంటవస్తూయున్న ఆంజనేయపురం గొల్లవాని తాలూకు మేకలను వెంట వున్న కాపలావారలను బెదరించి ఆ మేకలను జమీందారీ నౌకర్లు తోలుకొని వెళ్ళి పౌండు దొడ్డిలో పెట్టినారు.

(3) చిట్టేల గ్రామంలోని రహదారులో కొన్ని మార్గముల గుండా పశువులు, బండ్లు వెళ్ళకుండా అటకాయించ కూటదని 144వ శెక్షను తిరువూరు సబ్ మేజిస్ట్రేటుగారు 20-6-38 తేదీన యిచ్చియుండిరి. వారు 144 శెక్షణ యిచ్చిన రహదార్లు గాక మిగిలిన రహదార్లగుండా పశువులను, బండ్లను, వెళ్ళకుండా ఎస్టేటు నౌకర్లు యిబ్బంది కలుగజేయు చున్నారు.

(4) రైతుల పల్లం భూములకు కావలసిన నీరు పెట్టుకొనుటకు వీలు కలుగకుండా చేయగలందులకు గాను జమీందారీ నౌకర్లు మా యిష్టము లేనిదే యెవరు చెరువు తూములు తీసి నీరు పెట్టుకొన గూడదని బెదరించు చున్నారు. పశువులను సహితం నీరు త్రాగుటకు చెరువులోని నీటి వద్దకు రాకుండా నిర్బంధించు చున్నారు.

—మురుకుంట్ల వెంకటప్పయ్య.
10—7—38.

## కాళీపట్నం

### రైతుల రాయబారము.

ది 8-7-38 తేదీ న నర్సాపురము తాలూకా కాంగ్రెసు సంఘము ప॥ గో॥ జిల్లా రైతుసంఘముల యాజమాన్యమున కాళీపట్నము, పాతపాడు రైతులు తమ కష్టసుఖములు తెలుపుకొనుటకు నర్సాపురము సబ్‌కలెక్టరువారి వద్దకు మధ్యాహ్నము గం 12 లకు సుమారు 600 మంది రైతులు రాయబారము వెళ్ళిరి. శ్రీ గొట్టిముక్కల వెంకన్న యం. యల్. ఎ., వుద్దరాజు రామం, (తాలూకా కాంగ్రెసు సంఘాధ్యక్షులు.) యస్. వి. శివరావు బి. ఎ. బి. ఎల్. (పట్టణ కాంగ్రెసు కార్యదర్శి.) డాక్టరు తోలేటి సీతారాజు, భూపతిరాజు లక్ష్మీనరసరాజు (జిల్లా రైతుసంఘ ఉపాధ్యక్షులు, జిల్లా రైతుసంఘ ప్రధాన సహాయ కార్యదర్శులు.) నర్సాపురం, భీమవరం తాలూకా రైతు, కాంగ్రెసు సంఘాల [illegible] కాంగ్రెసు వర్కర్లు [illegible]

అధిపత్యము వహించిరి. శ్రీ గొట్టిముక్కల వెంకన్న యం. యల్. ఎ. గారు మెమోరాండమును సబ్‌కలెక్టరుగారికి యిచ్చిరి. మెమోరాండమును పూర్తిగా చదివిన పిమ్మట "మీ కష్టములు చెప్పుకోవలయునని" సబ్‌కలెక్టరు గారనిరి.

"కాళీపట్నము, పాతపాడు గ్రామములలో సుమారు 7500 యకరములు భూమికలదు. అందులో అడవి ప్రదేశము పోను మిగిలిన ప్రదేశము సుమారు 4000 యకరాలు పర్రభూమి యీభూమిలో ఎప్పుడు నీరుండును. పర్రలో గరువులు వేసి చేపలుపట్టుకొని జీవించుచున్నారము. ఎవరిభూమిలో వారే గరులు వేసుకొనెడివారమే గాని, యింకొక భూములలోనికి వెళ్ళెడివారము కాము, రైతులందరి భూములకు హద్దులుకూడ యున్నవి. యిటుల జరుగుచుండగా జమీందారుగారు మమ్ములను పిలిపించి ఎన్నాళ్ళు మీరు చేపలు పట్టుకొని జీవిస్తారు. కాలువ కొరకు ప్రయత్నము చేద్దాము. మీరందరు పిటీషన్లు పెట్టండి అని మా అందరిచేత కాలువకొరకు పిటీషన్లు పెట్టించిరి. కాలువ తయారైన తరువాత జమీందారుగారు యీ భూములన్నియు నావేననియు అమ్మకమునకు పెట్టుచుండిరి. మేమందరము వెళ్ళి మా భూములను మీరమ్ముటకు వీలులేదని చెప్పితిమి. అంతట జమీందారు మాలో కొందరిపై 107 సెక్షను జామీను కేసును, కాళీపట్నము, పాతపాడు గ్రామములకు 144 సెక్షనులను పెట్టించిరి. మేము రౌడీలముకాము. శిస్తులను కట్టుకొందుము, ఎవరినైనను మేము తిరుగుబాటు చేసియుండలేదు. కాబట్టి మాయట్టి బీదవారిపైన అమాయకులపై పెట్టిన సెక్షన్లను తీసివేయించ గోరుచున్నాము. మేము అడవిలోనికివెళ్ళి పుల్లలు, కర్రలు కొట్టుకొని తెచ్చి, మంచములు యితర గృహ పరికరములుచేసి అమ్ముకొని జీవించుచుండెడి వారము. 144 సెక్షను పెట్టుటవలన మేము కర్రలు తెచ్చుకొనుటకు వీలులేకపోవుటచే జీవనాధారము జరుగుటలేదు. జీవనాధారము కల్పించ ప్రార్థన." అని రైతులు చెప్పిరి.

శెక్షన్లు వెంటనే తీసివేయించాలని రైతులందరుగ గోలచేసిరి, సబ్‌కలెక్టరుగారు యీ సంగతులన్ని సవిస్తరముగా విన్నతరువాత బయట హాలులోనికి వచ్చి "నేను విచారించెదను. నేను గ్రామములలోని విషయములన్ని స్వయముగా విచారించుటకు వచ్చెద"ననిరి. రైతులు భూమి తమకు హక్కుగలదని రికార్డుతో సహా చెప్పుకొనిరి. సబ్ కలెక్టరు వారివద్ద శెలవు తీసుకొనిన తరువాత రైతులందరు జాతీయ పతాకములతో యిద్దరిద్దరు చొప్పున బారులుదీరి క్రమశిక్షణ పొందిన భటులవలె రైతు పాటలు పాడుకొనుచు 144వ సెక్షను రద్దు చేయవలసినదనియు, 107వ సెక్షను జామీను కేసులు రద్దు చేయించ వలసిన దనియు, కాంగ్రెసు సంస్థకు జే, కాంగ్రెసు మంత్రి వర్గము చిరస్థాయి యగుగాక, అను కేకలు వేసుకొనుచు బజారుల [illegible] వియ్య తిరిగిరి, మధ్య మధ్య సెంటర్లలో

ఉద్దరాజు రామంగారు పైన వ్రాసిన రైతుల కష్టములన్నిటిని సవిస్తారముగ చెప్పుచు, తమ సోదరులగు బీద రైతులకు యితరులందరు తగిన సాయమును సానుభూతిని చూపించ వలసినదిగా రైతులందరి తరపున ప్రజలకు విన్నవించిరి. యీ రైతులు చేపలు పట్టుకొని జీవించుటయేగాని యితర వృత్తిలేదు. యీ గ్రామములో సుమారు 700 కుటుంబములు కలవు. మొత్తం జనాభా 3500 మంది. యితర వృత్తిలేని యీ బీద రైతుల కష్టములను మంత్రివర్గం వారు తొలగించ వలసినదిగా కోరుచున్నామని కూడ చెప్పిరి. యీ మెమోరాండము కాపీలను మంత్రాంగ వారికిని, జిల్లా కాంగ్రెసు, జిల్లా రైతు సంఘముల కార్యాలయమునకును జిల్లా, కలెక్టరు వారికి సబ్ కలెక్టరు వారి ద్వారా పంపుకొనిరి.

నర్సాపురం, 9—7—38. } ఇట్లు, పేటేటి వెంకటరత్నం.
ప్రధాన కార్యదర్శి
ప॥ గో॥ జిల్లా రైతు సంఘము.
జిల్లా కాంగ్రెసు కమిటీ మెంబరు.

## మునగాల

భారతదేశాన్ని జుట్టిన దుఃఖభాజమగు యీ ఆర్థిక దుస్థితివలన రైతు జీవితము దుర్భరముగా యున్నది. అందులో జమీన్ రైతనుభవించు బాధల కంతులేదు. జమీందారీ విధానాని కెంతమంది నిస్సహాయులైన ప్రజలు గురి అవుతున్నారో మచ్చుకు కొన్ని రుచిచూపిస్తాను.

★

ముక్త్యాల జమీలో చెర్వుకొమ్ముపాలెం ఒక గ్రామము. ఆవూరిలోనే పాళం దూపారెడ్డిఅనే ఒక రైతున్నాడు. పదిమందికీ అనుకూలుడు. సుమారు పది సంవత్సరముల క్రిందట ఆవూరిలోని నల్లచెరువు వర్షాకాలములో పూర్తిగనిండి కట్టతెగినది. గండి పూడ్చుటకు యెక్కడా మన్ను లేకపోయింది. చెర్వుకట్టకు వెలుపలి భాగమున దూపారెడ్డిగారి పదిశెంట్ల దొడ్డి వున్నది. జమీందారుగారి నౌకర్లువచ్చి చెర్వుకట్ట బాగుచేయుటకు "నీ పదిశెంట్లభూమి మాకు యివ్వవలసింది దానికి బదులుగా నీకనుకూలమైనచోట తిరిగి పదిశెంట్లభూమి యిస్తామని" జమీందారుగారు చెప్పారని చెప్పినారు. ఆయన సరేఅన్నాడు. గజమున్నర లోతుపెట్టి మన్ను త్రవ్వి చెఱువుకట్ట గండి పూడ్చినారు. తరువాత రెడ్డిగారికి గ్రామకంఠములో వారిదొడ్డికి సరిహద్దుగానున్న జమీందారుగారి భూమిలోనుండి పదిశెంట్లు యిచ్చివేశారు. తన దొడ్డితో దాన్ని కలిపి భావిత్రవ్వించి నారింజ చెట్లు వేశాడు రెడ్డి. ఎనిమిది సంవత్సరముల అనంతరము ఒకనాడు జమీందారు నౌకర్లువచ్చి ఆంజనేయు తళోకనావాన్ని పెరికివేసినట్లు నారింజచెట్లను నాశనముచేశారు. భావిని పూడ్చి తిరిగి జమీందారుగారి భూమిలో కలిపివేశారు. రెడ్డిగారు స్వయముగావెళ్లి జమీందారుగారితో విన్నవించు కొంటే నీవు యిచ్చినభూమిలో గొయ్యి పూడిం

దని గుమాస్తా చెప్పాడు గనుక నీది నీవు తీసికోవలసినదేగాని మాది మాత్రము యివ్వమన్నారు. ఇప్పటికి ఆగొయ్యి అలాగేయున్నది. చూడండి చాడీకోర్ల మాటలువిని జమీందార్లు ఎన్ని దౌర్జన్యాలు చేస్తూయున్నారో.

★

ఆ గ్రామములోనే మేరుగు కృష్ణారెడ్డి, కోటిరెడ్డి, అను యిరువురు రైతులున్నారు. ఓకరోజు జమీందారు నౌకర్లు వచ్చి "మీ చవుటి గరప చేను సరిహద్దున యున్న జమీందారుగారి బీడు కొలిపించగా ఒక యకరము తక్కువైంది. గనుక అది మీ చేలోనుంచి తీసికొంటా"మన్నారు. "మావద్ద నుండి పది యకరముల అయిదు సెంట్లకు శిస్తు వసూలు చేయుచున్నారు. ఆ భూమిని జమీందారుగారే మాకు పట్టా యిచ్చియున్నారు, కాబట్టి మా పట్టా దాఖలా పొలము మాకు చూపించి మిగతాది మీరు తీసుకొనవచ్చును" అని జవాబిచ్చారు. అందు మీదట ఆ నౌకర్లు నిప్పులు త్రొక్కిన కోతులవలె మండిపడుచు "మీ భూమితో మాకు సంబంధము లేదు. మాకు తక్కువైన యకరము మీ పొలములోనే యున్నది. గనుక తీసికొంటాము. ఏ విధంగా అడ్డము వస్తారో చూస్తా"మని బెదరించి ప్రతియేటా దొమ్మీచేసి వాండ్ల పైరులు మేపుతున్నారు. ఆ భూమిలో వేపలు, ఈదులు మొదలగు చెట్లు వున్నవి. వాటన్నిటినీ కొట్టించి ఆ భూమిని ఆక్రమించాలని ప్రయత్నము చేయుచున్నారు. ఒకవేళ అడ్డము వెళ్ళితే వాళ్ళ ప్రాణాలు వాండ్లకు దక్కవు. ఈ విధంగా దొమ్మీతో వాండ్ల పిత్రార్జితమున్నూ, వాండ్లకు హక్కు భుక్తములు గలిగి నటువంటిన్నీ భూమిని లాక్కుంటున్నారు.

★

ఆ వూరిలోనే సుమారు నూరు సంవత్సరముల నుండి భుక్తమవుతున్న ఒక మోటుభావిని రైతుల వద్దనుండి జమీందారు లాక్కున్నారు, పాపమా రైతులు, ఆ భావిలోని నీరుపయోగించుకొని తోటలు చేసుకొని జీవించెడివారు. ఇప్పుడా భావి కంచచే చుట్టూ బంధింపబడింది. జమీందారు యాజ్ఞలేనిదే చీమైన నీళ్ళు త్రాగటానికి వీలులేదు. మోట తోలుకోటానికై కట్టిన రాళ్ళు నౌకర్లు ఎత్తుకపోయి వాండ్ల తాత ముత్తాతల గోరీలు మరమ్మతు చేయించారు.

★

ఒకరోజు జమీందారు నౌకర్లు వచ్చి చెఱువుకొమ్ము పాలెము మాలవాండ్ల యిండ్లలో కట్టివేసియున్న పశువులను తోలుకొనివెళ్ళి కోటలో కట్టివేసినారు. మాలవాండ్లు వెళ్లి మొఱబెట్టుకుంటే "రూ 25/లు జరిమానా విధించాము, చెల్లించి తోలుకొని పొమ్మ"న్నారు. అన్యాయంగా మా పశువులను తోలుకొనివచ్చి పైగా జరీమానా యెందుకండి బాబు" అనివాండ్లు కాస్త నోరెత్తి మాట్లాడారు. మండిపడి లేచారు నౌకర్లు. పశువులను బైటికి వెడలగొట్టి మాముందు కొడుకుల గొడ్ల తోలుకొని పోతున్నా

ని కేకలు వేశారు. అంతటితో పది మంది సమిగుడారు. వాండ్లమీద నేరము మోపారు. ముప్పది అయిదు రూపాయలతో ఈ గోగ్రహణం అణగి పోయింది.

—బండి తిరుపతయ్య చౌదరి.

## కలవలపల్లి

ఈ గ్రామమునకు సుమారు 4 మైళ్ళ దూరములోనున్న కలవలపల్లి గ్రామమునందు ఇదివరకు నుండి ఈ గ్రామరైతుల ఆధీనమునందు యున్న సుమారు 500 ఎకరములు ఇప్పుడు క్రొత్తగా ఆక్రమించుకొన్నారనే నెపములో సుమారు 30 పేదరైతల మీద పోలీసు కేసుపెట్టి ఆగ్రామ జమిందారుగారు ఇచ్చటి పేదరైతులను బాధించు చున్నారు.

కావున జిల్లా కాంగ్రెసు సంఘమువారున్ను జిల్లా రైతు సంఘమువారున్నూ ఈ విషయమై తగు శ్రద్ధవహించి ఇచ్చటి రైతుల కష్టములను తొలగించవలెనని కోరుచున్నాను.

ఇట్లు
అబ్దుల్ మజీద్‌ఖాన్,
కార్యదర్శి,
కొవ్వూరు తా॥ కాంగ్రెసు సంఘము

## నూజివీడు

మాది నూజివీడులోని జమీందారుని గ్రామం. మాగ్రామం నుంచి సుమారు 5000-0-0 రూపాయల శిస్తు వసూలగుచున్నది. కాని రైతులకు ఏమి పనులు చేయించ వలయులో ఒక మారైనను యోచింపరు జమీందారుగారు. పూర్వం కాలవల మరమ్మతుకు రెండు వందల రూపాయల నిచ్చెడివారట. కాని 10, 15 సంవత్సరాల నుంచి ఆ డబ్బుకూడా ఇచ్చుటలేదు. 5, 6 సంవత్సరముల క్రిందట వరదకు తెగిపోయి నటువంటి కట్టను యింతవరకును పోయించ లేదు. ఆ మురుగుకట్ట తెగిపోయినందున భూములు ఏమియు పండలేదు. గవర్నమెంటు వారు నీటి పన్నును మానలేదు. వేలం వేసుకొని కూడా పన్ను తీసుకొని పోయినారు. యీ సంగతి జమీందారునకు చెప్పుకుందామని వెళ్ళితే అయన దర్శనం ఇచ్చే వాడు కాడు. 10, 12 రోజులు ఆయన మేడ ఎదురుగా పడియున్నను ఆయనకు దయవచ్చేది కాదు. ఎన్ని రోజులని పాపమా రైతులు ఆ దుమ్ములో పడి చివరకు చేయు గత్యంతరం మేమియులేక ఒక నిట్టూర్పు విడచి ప్రేగులు ఎండబెట్టుకొని యింటికి వచ్చేవారు. ఇంటికి రాగానే దారిద్ర్య పిశాచము వారికంటె ముందుగనే యింటియందు ప్రవేశించెడిది. రైతులు ఇన్ని యీతి బాధలు పడుచున్నను జమీందారుగారు వారి శిస్తును ఒక్క దమ్మిడీ యైనను విడిచిపెట్ట కుండగనే యావత్తు పైసలతో సహా తీసుకొని పోవు

చున్నారు. మా జమీందారుగారు ఒక పర్యాయము జిల్లాబోర్డు మెంబరుగా నిలబడ్డారు. అప్పుడు ఆయన తన ప్రతి గ్రామము తిరిగి తన యిబ్బందినంతయు ప్రజలకు చెప్పుకొని యున్నారు. పాప పుణ్యము లెరుగ నటువంటి అమాయకపు ప్రజలు మన జమీందారు వచ్చి మనలను ఓట్లను అడిగినారు మన మాటలను ఆయన వినకపోయినను మనము కూడా వారి వలె చేయరాదు, అని నీతి బద్ధులై ఆయనకు ఓట్లు ఇచ్చియున్నారు. ఆయన పోటీయందు గెల్చినాడు కూడాను. ఆయన ఆ రోడ్డును పోయించ లేదు సరికదా జిల్లాబోర్డు వారిచేత కూడా పోయించలేదు.

తాను చెరువులు త్రవ్వించుట లేదు సరికదా. జిల్లాబోర్డువారి యాధీనమందున్న చెరువులను ఆయన లాగుకొని ఒక మరమ్మతు కూడా చేయించుట లేదు. ప్రతి సంవత్సరం తన ఉద్యోగస్తుని పంపి చెరువులోని చేపలను వేలం వేయించుకు పోతారు.

ఇప్పటికి 7—8 సంవత్సరము నుంచి చెరువు ఆయన స్వాధీనము క్రిందకు వెళ్ళినది. ఇన్ని సంవత్సరములనుంచి ఒక 10 రు పెట్టి ఒక రేవు కట్టించలేదు. పనులు చేయించుటకు వీలులేదుగాని చెరువులోని చేపలను మాత్రము ప్రతి సంవత్సరం తప్పకుండా వచ్చి వేలం వేయించుకొనెదరు. ఆవేలం వేసే సమయం కూడా రైతులు మంచి వూడ్పుల సమయంలో వేలం వేస్తారు, వేలం వేయగనే చేపలు పట్టెదరు. ఊడ్పుల సమయంలో చెరువులో నీర్లు లేక ఎక్కడనో చుట్టుప్రక్కల దూరంగాపోయి చాలా అవస్థపడి నీళ్ళు తెచ్చుకొనవలసివస్తుంది. మనుష్యులు దొరకని సమయంలో ఒక మనుష్యుడు నీళ్ళుతెచ్చుటకు ప్రతి రైతుకూ వుండవలసి వస్తూంది. ప్రజల కష్టసుఖముల నాలోచించుట జమీందారుగారి యాచారము కాదు. ఇదియునుగాక ఎక్కడైన బంజరు భూమి యున్న, దానికి రేటుపెంచి పాటపాడించి రైతులకు ఇచ్చుచున్నారు. పశువులు నచ్చుటకును వెళ్ళుటకును, దారి వెడల్పుగా వుంచుకొన్నటువంటి డొంకలు వగైరాలు ఏ కొద్దిగానో దారి యుంచి మిగతా డొంకనంతయును వారి ఉద్యోగస్తునకు బహుమతిగా ఇచ్చుచున్నారు. చేను గట్టున ఎంతో ప్రేమతో పెంచినటువంటి చెట్లు వగైరా జమీందారులు వచ్చి వేలం వేయించి పోతున్నారు. ఇన్ని బాధలు పడుచున్న యీ జమీందారీ గ్రామరైతుల కష్టము లెప్పుడు అంతమగునో తెలియకున్నది. కాంగ్రెసు మంత్రులు వచ్చిరిగదా యని రైతులో కప్పుడు వుప్పొంగియున్నారు. కాని వారి ఉత్సాహమునకు తగినంత సహాయం రాలేదు. కనుక జమీందారీ రైతులందరును తమ తమ గ్రామ తాలూకా జిల్లాలయందు ఆందోళన ప్రారంభించి తమ కష్టములను బాగుగా మన మంత్రులకు ఎరుగజేయవలెను.

—య[illegible] వెంకట్రావు.

సప్తమ ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ వాయిదా వేయబడెను.

మహాసభ ప్రతినిధుల ఎన్నికలగూర్చి కొన్ని జిల్లాలకు తెలియకపోవుట వల్లను, కొన్ని జిల్లాలలో సకాలమునకు ఎన్నికలుజరగక ఆగిపోవుట వల్లను, ఎన్నుకొనబడ్డ ప్రతినిధుల కందరికి నోటీసులు జేరకపోవుట వల్లను, ఊడ్పుల పనులు ముమ్మరంగా ఉండుటవల్లను, జూలై 12, 13 లలో జరుగవలసిన పై మహాసభకు ప్రతినిధులు చాలా స్వల్పముగా వచ్చిరి, కార్యనిర్వాహకవర్గ సభ, స్థాయి సంఘసభ, మహాసభయు వాయిదా వేయబడినవి, మరల జరుగు తేదీలు ముందు ప్రకటించబడును. మహాసభలో ప్రవేశపెట్టబడు తీర్మానాలన్నియు జిల్లా సంఘములకు, ప్రతినిధులకు, సర్క్యులేటు చేయబడుచున్నవి. కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా వీరవల్లి గ్రామంలో పై సమావేశమును జర్పుటకు ఆహ్వానము వచ్చినది" అని ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ ప్రధాన కార్యదర్శి వ్రాయుచున్నారు.

★ ★ ★

### కృష్ణాజిల్లా రైతు సంఘము.

ది 9-7-38 న గుడివాడలో రైతు సంఘ సాధారణ సమావేశము జరిగినది. పి. డబ్ల్యు. డి. శాఖలోని లంచగొండి తనమును విచారించి ఆగష్టు నెలాఖరులోగా రిపోర్టు పంపుటకును సెప్టెంబరులో కృష్ణాజిల్లా రైతాంగ విద్యాలయమును సాగించుటకును కామినేని వెంకటప్పయ్య, అన్నె అంజయ్య, పేట బాపయ్యగార్లు మొదలగు వారితో ఉపసంఘము ఏర్పరుపబడెను. కవుతరం పంచాయితీబోర్డును గూర్చి విచారించుటకు కామినేని వెంకటప్పయ్య, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య, పి. వి. రాఘవయ్య గార్లతో ఉపసంఘ మేర్పరుప బడెను. శాసన సభ్యులు తెలుగులో మాట్లాడవలెనను రాష్ట్ర కాంగ్రెసు తీర్మానాన్ని ఆమోదిస్తూ, దీన్ని అ॥ భా॥ కాం॥ సంఘం తిరస్కరించిన పట్టాభిగార్ని కార్యనిర్వాహక వర్గము సభ్యత్వమునకు రాజీనామా నీయవలెనని తీర్మానములు గావింపబడెను.

గత ది 15 న ప్రధానామాత్యులు బందరు వచ్చినపుడు జిల్లా రైతు సంఘం మెమోరాండమును సమర్పించెను. ఋణనివారణ చట్టమును జయప్రదమొనర్చుటకై పరపతి సౌకర్యాలను కల్గించాలనియు, ఎ. లాం. ఆక్టు 112 శెక్షనును ఋణవిముక్తి శాసనం 23 శెక్షను క్రిందకు తేవలెననియు, నజరానా పద్ధతిని తొలగించవలెననియు, ఈస్టు బాంకు తెనాలు క్రింది సాగుకు లాంగుక్రాపుకు, అధమం మీడియం క్రాపుకు, నీటిని సప్లయి చేయించాలనియు, ఎ. లాం. ఆక్టు సవరణ కాబడునని జమీందార్లుచేయు దుండగములను, అక్రమములను అరికట్టి, సవరణలను త్వరలో గావించాలనియు, ఎకరముల వెంట పన్ను వసూలుచేయుటను మార్చి నికరాదాయముపై పన్ను విధించాలనియు, సి. ఐ. డి. లను లంచగొండులపై

ప్రయోగించాలనియు అందులో తెల్పబడెను నజరానాలను గూర్చి ఆలోచించు చున్నామనియు ఎ. లాం. ఆక్టు 112 శెక్షను క్రింది స్థిరాస్తి వేలాలు ఋణవిముక్తి శాసనం 23 శెక్షను క్రిందకు రాదనియు ప్రధానామాత్యులు తెల్పిరి. వీటికొరకై వెంటనే ఆందోళన జర్పవలసి యున్నది.

★ ★ ★

### ప॥ గో. జిల్లా రైతు సంఘము.

పై సంఘ సాధారణ సమావేశము ది 9-7-38 న జరిగెను. జిల్లాలో జరుగుచున్న రైతు - జమీందార్ల మధ్య తగాదాలను విచారించుటకు పేటేటి వెంకటరత్నం గారిని కన్వీనరుగాగల ఉపసంఘ మేర్పరుప బడెను, కొవ్వూరు తాలూకా బ్రాహ్మణ గూడెంలోని వ్యవసాయ కూలీలకు ఇండ్ల స్థలముల నివ్వవలెననియు, కాళీపట్నం భూముల తగాదాలో జమీందారు పిటీషనుపై జారీ చేయబడిన 144, 107 శెక్షన్లను రద్దు చేయాలనియు ప్రభుత్వమును కోరుచు, తీర్మానములును, స్థానిక సంస్థల ఎన్నికలలో రైతులకు, కూలీలకు ఎక్కువ అవుసరం గనుక వాటికి అభ్యర్థులను నిల్పునపుడు రైతు, కూలీ సంఘాల సలహాలను తీసికొన వలసినదిగా కాంగ్రెసు సివిక్ బోర్డును కోరుచు తీర్మానమును, కొల్లేరు అనే సర్వే గవర్నమెంటు అస్సెస్డు భూములను, అగడాల్లంక అనే సర్వే భూమలను, ట్రాక్టర్ల సహాయంచే సహకార వ్యవసాయ పద్ధతులపై చేసికొనుటకు జిల్లా రైతు సంఘమువారి కివ్వవలసినదిగా డిప్యూటీ కలెక్టరును కోరుచు తీర్మానమును, అగడాల్లంక అస్సెస్టు భూముల తగాదాను విచారించుటకు ఉప సంఘమును నియమిస్తూ తీర్మానము గావింపబడెను.

★ ★ ★

### ఉ॥ వి॥ జిల్లా రైతు సంఘం,

జలంత్రా (ఒరిస్సా) ఎస్టేటులో అడవి ఇబ్బందులనుగూర్చి ఇంతవరకు పంపబడ్డ మహజర్ల విషయమై ప్రభుత్వం శ్రద్ధ గైకొనక పోవుటచేముందు కర్తవ్యమును గూర్చి ఆలోచించుటకు ది 13-7-38 న నవుదూరి శేషయ్యగారి అధ్యక్షతను ఎస్టేటు రైతుల సభ జరిగెను. వివిధ ప్రాంతాల రైతులు, జనులు అధికంగా వచ్చిరి. కాంగ్రెసు మంత్రుల అశ్రద్ధను గూర్చి అసంతృప్తి వెల్లడించ బడెను. మూడు మాసములలో తమ కష్టములు తొలగింప బడకపోతే అటవీ సత్యాగ్రహం జర్పాలనియు, ప్రతి గ్రామము కనీసం ఒకరిని పంపుటకును, సత్యాగ్రహ శిబిరాన్ని స్థాపించుటకును తీర్మానింపబడెను. మరియు ఎస్టేట్సులందు ఆక్టు సవరణలు రైతుల కనీసపు కోర్కెలకును, కాంగ్రెసు ఉపసంఘ నివేదికకును, విశ్వనాథ దాసుగారి సవరణ చట్టమునకును తీసిపోకూడదనియు తీర్మానింపబడెను.

### ఏ వర్గం వారైనా మహిళలకు ప్రత్యేక కష్టాలున్నాయి.

# స్త్రీ సంఘాలెందుకు? ఎలా ఉండాలి?

—"చంద్రం"

సమాజం అభివృద్ధి చెందాలంటే అందలి అంతర్గత భాగాలన్నీ చైతన్యం విజ్ఞానం పొందడానికి సమాన అవకాశాలుండాలి. ఒక భాగం అమాయకత్వంలో ఉండగా రెండో భాగం ఎంత విజ్ఞానవంతమైనా సర్వతోముఖాభి వృద్ధికి ప్రయత్నాలు విఫలమౌతాయి. ఎందుకనగా యీ సంగ్రామ సముద్రంలో ఈత ఎరుగని అమాయకులు, నేర్చినవారి కౌశల్యాన్ని కూడా కుంటువడ జేస్తారు.

భారతదేశ ప్రజలమగు మనం మనపాని సతనాన్ని దారిద్ర్య నిరుద్యోగాలను నిర్మూలించడానికి పోరాడుతున్నాము. మనలో సగభాగమైన స్త్రీ జనులలో చైతన్యం విజ్ఞానం, వృద్ధిచెంది, ప్రస్తుతం సమాజంలో వారు పొందుచున్న నికృష్టస్థితి నుండి విముక్తి కొరకు పోరాటం సాగించ గలిగినపుడే, విదేశ ప్రభుత్వాన్ని, దోపిడి విధానాన్ని, దారిద్ర్యాన్ని తొలగించడానికి మనమందరం చేయుచున్న జాతీయ పోరాటంలో తగినంత పాల్గొన గల్గుతారు. ప్రస్తుత సమాజంలో స్త్రీలకు వ్యక్తిత్వం లేదు. వారసత్వ హక్కులు, ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. అనేక దురాచారాలు-బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, ఘోషా వగైరాలు, వారిని యిప్పటి స్థితినుండి ఉన్నతికి రాకుండ అడ్డుతగులుతున్నాయి. అనగా వివిధ వర్గాలకు చెందిన ప్రజలందరు అనుభవించుచున్న కష్టాలే గాక స్త్రీలు ప్రత్యేకంగా సాంఘిక దురాచారాల అలవాట్ల నుండి బాధపడుతున్నారు.

స్త్రీ బాల్యంలో తండ్రి, సోదరులు, తరువాత భర్త, వృద్ధాప్యంలో కొడుకులు కాపాడవలసిన ఒక రకపు ఆస్తి, వస్తువుగానూ, బిడ్డలను కను యంత్రంగానూ, పరిగణింప బడుతూంది. సంఘంలో స్త్రీలోక భాగమైనందున సమాజ పునర్నిర్మాణ పోరాటంలో వారికున్న స్థానం గుర్తింప బడుట లేదు. ఒక్కొకచో పాల్గొన్నా, భర్త లేక సోదరుల అనుచరులుగానే గాని స్వతంత్ర్యం గల్గిన వ్యక్తులుగా కాదు. కాబట్టి స్త్రీలు తమ అభివృద్ధికి ఆటంకం కల్గించుచున్న ఆచారాలను నిర్మూలించడానికి, తమకు సమాజంలో సమాన స్థానం సంపాదించడానికి, పోరాటం సాగించడానికి మహిళా సంఘాలు అవసరం. మహిళా సంఘాల ద్వారా తమకు జరుగుచున్న సాంఘిక అన్యాయాలను ఎదుర్కోడంలో స్త్రీలలో చైతన్యం విజ్ఞానం పెంపొంది, భారత ప్రజలందరం సాగించ వలసిన జాతీయ పోరాటంలో ప్రాముఖ్యమైన పాత్రను వహించ గల్గుతారు.

ఐతే మహిళా సంఘాలు ఎలా నిర్మించాలనేది చర్చించుదాం. మహిళా సంఘాలు వుండాలని అంగీకరించే వారిలో మూడు దృక్పథాలున్నాయి.

1. ఇదివరకున్న మహిళా సంఘాలు బూర్జువా మహిళా సంఘాలనియు, కష్టజీవులైన స్త్రీలకందు అవకాశంలేదనియు, అందుచే నిజమైన (కార్మిక కర్షక) మహిళాసంఘాలు స్థాపించాలంటారు కొందరు.

2. మధ్యతరగతి, పై తరగతుల వర్గాలకు చెందిన స్త్రీలకే మహిళా సంఘాలనియు, కార్మిక స్త్రీలు ఆర్థికంగా స్వతంత్రులు: దైవోర్సుహక్కులు కల్గివున్నారు: కాన వారికి ప్రత్యేక మహిళా సంఘాలనవసరమనియు, వారి కష్టాలు వారి వర్గకష్టాలే గాన వర్గసంఘాల ద్వారా తీర్చుకోవచ్చునని అంటారు కొందరు.

3. స్త్రీలందరూ ఏవర్గానికి చెందినా ప్రస్తుత సమాజంలో ప్రత్యేక కష్టాలనుభవించుచున్నారనియు, వారందరు స్త్రీలుగా అనుభవించుచున్న కష్టాలను తొలగించుకోడానికి అన్నివర్గాలకు చెందిన స్త్రీలను సంఘటితం చేసేవిగా మహిళా సంఘాలుండాలంటారు మరికొందరు.

ఈమూడు వాదనలలో ఏదృక్పథం సరియైనది? మహిళా సంఘాలు యెలా వుండాలి? అని నిర్ణయించుటకు ముందు ప్రస్తుత సమాజంలో వివిధవర్గాలకు చెందిన స్త్రీల స్థానమేమిటో పరిశీలించుదాం.

1. ఫ్యూడల్ (జమీందారీ) వర్గము:- ఈ వర్గానికి చెందిన స్త్రీలలో ఘోషా విపరీతము. స్వేచ్ఛావాయువులు పీల్చుటకే ఆస్కారం లేదు. పురుషులకు బహుభార్యాత్వం జాస్తి. వర్గం చిన్నది, భాగ్యవంతమైనది, హోదాకు తగ్గినవారి కిచ్చుట మార్యాద లోపమని యెంచుటచే కన్యలకు వరులు దొరుకుట కష్టసాధ్య మగుటచే పెండ్లికూర్చుకే కష్టం. "స్త్రీలు బహు దాసీజన పరివేష్టితులైనా, సకలభూషణోపేతలైనా" బోనులందుంచిన సర్కసు మృగాల జీవితంవంటిదే వీరి జీవితం. దైవోర్సు హక్కులు లేవు. నిర్బంధ వైధవ్యముంది. ఆర్థిక స్వాతంత్ర్యం శూన్యం.

2. బూర్జువా (ధనిక) వర్గస్త్రీలు:— పట్టణాల్లోని బూర్జువా వర్గస్త్రీలకు విద్యా సౌకర్యముంది. ఇపుడిపుడు కొందరు క్లబ్బులలో ఆటల్లో పాల్గొంటున్నారు. ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. ఆస్తిహక్కులు లేవు. రంగు రంగుల దుస్తులు విలువైన నగలు ధరించినా, రోగీ, క్రూరుడైన భర్తను సైతం దైవోర్సుచేయు హక్కు లేదు. నిర్బంధ వైధవ్యముంది.

3. మధ్యమతరగతి స్త్రీలు:— ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. కులాలు ఆచారాల ననుసరించి వీరిస్థితి వుంటుంది. కొన్ని కులాలు ఫ్యూడల్ ప్రభువుల ఆచారాలు (వారికి ఆస్థి లేకపోయినా) ఘోషావగైరా అనుసరిస్తున్నాయి. మొత్తం అందరికీ ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. దైవోర్సు హక్కులేదు: నిర్బంధ వైధవ్యముంది. ప్రస్తుత ఆర్థిక విధానంలో క్రమంగా కార్మిక వర్గంలోకి దిగజారుతున్న వీరు తమ ఆచారాలవలన, ఫ్యూడల్, బూర్జువా వర్గాల అనుకరణవైపు తలలెత్తి చూచుట వలన (ఘోషా, దుస్తులు, పెండ్లిళ్లకు విపరీతంగా ఖర్చుచేయుట వగైరా) మరింత బాధపడుచున్నారు.

4. కార్మిక వర్గ స్త్రీలు:—తక్కువ కులాలలో ఆర్థిక స్వాతంత్ర్య ముంది: దైవోర్సు (వివాహ విచ్ఛేదం-చెల్లుచీట్లు పుచ్చుకోడం) వుంది. కులాలు వీరిలో సైతం సడలించక పోవుటచే, యీ వర్గంలోనే కొందరిలో దైవోర్సు హక్కు లేదు. స్త్రీలు కూడా పనిచేసి కొంత సంపాదించినా, పురుషుడు సమాజంలో ప్రచలితంగా వున్న ఉన్నతస్థితి (కొట్టుట తిట్టుట) చెలాయిస్తూనే వుంటారు. ఇద్దరూ కష్టపడి సంపాదించినా పురుషుడు తన సంపాదన దుర్వినియోగపరచి కుటుంబ పోషణంతా స్త్రీపైనే వదలుతాడు. పైగా అధికారం కూడా చెలాయిస్తాడు. ఈ వర్గానికి, చెందని పై కులాల స్త్రీలు యింట్లో పని తప్ప యితర పని చేయక సంపాదనలో భర్తకు సాయపడక బరువగు చున్నారు. ఈ వర్గ స్త్రీలకు ముఖ్యమైనది ప్రసవ సమయాల్లో వైద్య సౌకర్యాలు, జీతంపై సెలవులు, పురుషులతో పాటు సమానమైన కూలి కొరకు ముఖ్యంగా పోరాడుట. ఈ కోర్కెలకు పై అన్ని వర్గాల స్త్రీలు కూడ తోడ్పడటానికి ఎక్కువ అవకాశాలున్నాయి.

పై పరిశీలనను సరించి స్త్రీలందరు మొత్తంగా అనుభవించుచున్న కష్టాలున్నాయి. ఈ కష్టాలను తొలగించడానికి ప్రత్యేక మహిళా సంఘాలు కావాలి. అవి ఒక వర్గం లేక కొన్ని వర్గాల స్త్రీలకు చెందినవి గాక అన్ని వర్గాల స్త్రీ జనుల హక్కుల కొరకై పోరాడు సంఘాలుగా వుండాలి. వర్గ సంఘాలు వర్గ హక్కుల రక్షణ కొరకు పోరాడినటులే మహిళా సంఘాలు స్త్రీలందరి హక్కుల కొరకు పోరాడుతాయి. స్త్రీలలో చైతన్యం గలిగి, తామూ పీడితులమని గ్రహించి నపుడు వారి సానుభూతి, సహకారాలు పీడిత వర్గాల పోరాటాన్ని బలపరచడానికి సంపాదించడం కష్టం కాదు.

కాన మహిళా సంఘాలు ఈ దిగువ హక్కుల సంపాదించడానికి ఆందోళన, పోరాటం సాగించాలి.

1. స్త్రీలకు కూడ ఆస్తిపై వారసత్వ హక్కుండాలి.

2. రోగిష్టులు, క్రూరులు, చెడుప్రవర్తన గల్గిన భర్తలను దైవోర్సుచేయు హక్కుండాలి. అందుకొరకు శాసనం గావించాలి.

3. పురుషుల బహు పత్నీత్వం శాసన రూపేణా నిషేధించాలి.

4. ఘోషా మొదలైన కట్టుబాట్లకు వ్యతిరేకంగా ప్రచారం గావించాలి.

5. పురుషులతో సమానమైన కూలి యివ్వాలి.

6. ప్రసవ సౌకర్యాలు ప్రభుత్వం ఎక్కువ చెయ్యాలి. కార్మిక స్త్రీలకు ప్రసవకాలంలో 4 నెలలు జీతంపై సెలవివ్వాలి.

7. అన్నిరకాల ఉద్యోగాలకు స్త్రీలకు సమానావకాశా లుండాలి.

8. స్త్రీలలో చైతన్యం కల్గించుటకు మహిళా సంఘాలు, ఆ సంబంధమైన సాహిత్యం ప్రకటించుటకు కృషిచెయ్యాలి. ఇది ముఖ్యం.



# కాంగ్రెస్ రాష్ట్రాలను ఇతర రాష్ట్రాలు అనుకరిస్తున్నాయి!

## సి. పి., సింధు, ఫ్రాంటియర్లలో మంత్రుల కష్టాలు:

## బెంగాల్‌లో మద్యపాన నిషేధం: వెల్లింగ్డన్ దర్పాలు

ఊటీ బ్యాంకు కేసు ఖైదీల విడుదల

మదరాసు, ఊటీ బ్యాంకి కేసులలో శిక్ష విధింపబడ్డ ఖుషీరాం మెహతా, హజారాసింగు, ప్రేమప్రకాష్, శంభు నాథ్, బచ్చులాల్‌గార్ల విడుదలకై మదరాసు ప్రభుత్వం ఆర్డర్లు పంపింది. ఆర్డర్లు చేరిన వెంటనే, ఆయా రాష్ట్రముల ప్రభుత్వాలు వారిని విడుదల చేస్తాయి.

అసలు వీరు రాజకీయ ఖైదీలే కారని మొదట్లో రాజగోపాలాచారిగారు ప్రకటించారు. అప్పటినుంచీ మన రాజధానిలో, ముఖ్యముగా ఆంధ్ర రాష్ట్రంలో పెద్ద ఆందోళన ప్రారంభమయింది. పంజాబ్, సంయుక్త రాష్ట్రాలలోకూడా వీరి విడుదలకొరకు చాలా ఆందోళన చేశారు. ఈ మధ్యనే పంజాబు జైళ్ళలో ఉంచబడ్డ ఊటీ బ్యాంకికేసు ఖైదీలు తమ్ము విడుదల అయినా చెయ్యండి, లేక మదరాసురాష్ట్రపు జైళ్ళకైనా పంపండి అంటూ గాంధిగారికి, రాజాజీకి లేఖలు వ్రాశారు. ఆవిధంగా చేయకపోతే, జూలై 12వ తేదీ నుంచి నిరశనవ్రతం ప్రారంభించబోతున్నామని నోటీసు యిచ్చారు.

దీనికితోడు, వీరి విడుదలకు ఆలస్యం చేస్తూన్నది మదరాసు ప్రభుత్వమేగాని పంజాబు యు. పి. ప్రభుత్వాలు కాదని నిరూపించుటకు అనేక ఉత్తర ప్రత్యుత్తరాలు గాంధిగారి వద్దకు కాంగ్రెసు అధ్యక్షుడైన బోసు వద్దకు వచ్చాయి. రేపు వార్ధాలో జరుగబోవు వర్కింగు కమిటీ ఎజండాలో ప్రధానమైన అంశము యిదేనంటూ హిందూ పత్రిక యొక్క బొంబాయి విలేఖరి వ్రాశాడు. బొంబాయి కాంగ్రెసు సోషలిస్టులు యీ సమస్యను గురించి అనేక వివరాలు వర్కింగు కమిటీకి పంపియున్నారు.

ఇంత హడావిడి, యింత ఆర్భాటం జరగక ముందే రాజగోపాలాచారి గారు వీరి విడుదలకై ఆర్డరు చేస్తే ఎంతైనా బాగుండేది. రేపు విడుదల ఆర్డర్లు పంపుతారనగా యీవేళ రాజగోపాలాచారిగారు ఒక ఉపన్యాసంలో ఊటీ ఖైదీలను గురించి మాట్లాడారు. పంజాబు శాసనసభలో మంత్రులు రాజాజీ మీదికే తప్పునంతటినీ త్రోశారు. అయినప్పటికీ, ఇప్పటికైనా వారు స్వేచ్ఛా వాయువులు పీల్చుటకు అనుమతినిచ్చిన మదరాసు మంత్రి వర్గాన్ని పూర్తిగా అభినందించవలసి యున్నది.

కాంగ్రెసు రాష్ట్రాలు

లక్నో జిల్లాలో సర్దార్ ప్రసాద్ మిస్రా అనే ఎక్సైజు ఉద్యోగస్థుడు, మరియిద్దరు ప్రభుత్వోద్యోగులు లంచాలు తీసుకున్నందుకు సంయుక్త రాష్ట్ర ప్రభుత్వం డిస్మిసు చేసింది.

ఒరిస్సా జైళ్ళలో ఖైదీలకు చక్కని కూరకాయలు, ఊరగాయలు ఇయబడుతున్నాయనియు; ఇదివరకు మాదిరిగా వారు "సర్కార్ సలాం" అనే పద్ధతి యేజైలులోనూ లేదనియూ ఒరిస్సావంటి అతిచిన్న కాంగ్రెసు రాష్ట్రమునకు, బెంగాల్‌వంటి పెద్ద కాంగ్రెసేతర రాష్ట్రమునకు యీ విషయములో "విపరీతమైన భేదము" గలదనియు కె. ఆర్. ఠాకూర్ అను ఒక బెంగాల్ యం. ఎల్. ఏ. ఒరిస్సా జైళ్లను స్వయంగా చూచి అభిప్రాయ మిచ్చాడు.

సేలం జిల్లాతోపాటు, చిత్తూరు, కడప జిల్లాలలోకూడా మద్యపాన నిషేధాన్ని అమలు పరచుటకు మదరాసు ప్రభుత్వంవారు నిశ్చయించారు.

ట్యూటికోరిన్‌లో జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి వీరబాహుగారున్నూ, శామ్యూల్ గారను మరొక కాంగ్రెసు నాయకుడును మంత్రిత్వ స్వీకార దినోత్సవం నాడు బహిరంగ సభలో ఉపన్యసించుచుండగా జస్టిస్‌పార్టీకి చెందిన ముంటరులు కొందరు దౌర్జన్యంగా మీదపడి పొడిచారు.

బీహార్ రాష్ట్రంలో అన్ని విద్యాసంస్థలపైనను, అన్ని యితర పబ్లిక్ సంస్థలపైనను జాతీయ పతాకమునే ఎగురవేయాలని ఆర్డర్లు పంపారు.

మధ్య పరగణాలలో హైస్కూళ్ళలోని బాలురకు మిలిటరీ శిక్షణ నీయుటకు మంత్రి వర్గం తీర్మానించారు.

బీహార్ రాష్ట్రంలో యెక్కడా వెట్టిచాకిరి పనికిరాదని ఆజ్ఞాపించారు.

కాంగ్రెసేతర రాష్ట్రాలు

ఢిల్లీలో, బాబూలాల్ అను ఒక బుక్కుసెల్లర్‌యొక్క షాపును పోలీసులు సోదాచేసి, యీ క్రింది పుస్తకాలను తీసుకుపోయారు.

1. దరిద్రుల పిలుపు (గరీబ్-కి-పుకార్)
2. మండుచున్న విప్లవం (క్రాంతి జలి)
3. పీడిత ప్రజల హృదయవేదన (ధూకే-దిల్‌కీ-పుకార్)
4. జాతీయ గీతములు (రాష్ట్రీయగాన్)
5. విప్లవాగ్ని (క్రాంతి-కీ-చితారి)

రాజద్రోహ నేరమునకు మాస్టర్ మోతాసింగుగారికి 3 సం.ల కఠినశిక్ష పంజాబుప్రభుత్వం విధించింది. ఢిల్లీలో ప్రకటింపపడు రాయ్‌స్ వీక్లీ అనే పత్రికపై కోర్టుధికారనేరం ఆరోపింపబడి, పత్రికా సంపాదకునియెడల ఎరస్టు చేయరాదో తెలుపుటకు లాహోరు కోర్టువారు నోటీసిచ్చారు. గురుదత్తసింగు అను పంజాబు సోషలిస్టుపై అక్కడి గవర్నమెంటు అప్రూవరును ఖూనీచేసిన నేరమునకై, ఉరి శిక్ష విధించారు. ఇట్లే ఇషార్‌సింగు అను మరొక సోషలిస్టుపై ఖూనీనేరము మోప బడింది. విచారణ పూర్తి అయింది. తీర్పు మాత్రం తరువాయి.

పృధ్వీసింగును బొంబాయి జైలునుండి పంజాబ్‌తో రావల్పిండి జైలుకు ట్రాన్సుఫర్ చేశారు.

రాజద్రోహనేరానికి శ్రీ సత్యవతీదేవిగారికి 3 నెలల ఖైదు శిక్ష విధించారు. హైకోర్టులో కూడా పైశిక్షను ఖాయపరచారు. ఎరస్టుచేసి జైలుకు తీసుకెళ్ళారు.

బెంగాల్ గవర్నమెంటు ప్రతివారం డిటెన్యూలను విడుదల చేస్తోంది. ఇంకా 300 మంది డిటెన్యూలు జైళ్ళలో ఉన్నారు. 350 మంది రాజకీయ ఖైదీలు, 14 రు స్టేట్ ఖైదీలు కూడా ఉన్నారు. విడుదల చేయబడ్డ డిటెన్యూలు దరిద్ర బాధతోను, జబ్బులతోనూ నానా అవస్థలు పడుతున్నారు. కొందరు ఆత్మహత్య చేసుకుంటున్నారు. ఈ మధ్యనే విడుదల కాబడిన రవీంద్రకుమార బెనర్జీగారను ఒక రాజకీయ ఖైదీ—క్షయరోగపు ఆసుపత్రిలో మరణించారు.

బెంగాల్‌లో గోపాల్‌గంజ్ అనే పట్టణమునకు చుట్టుపట్ల నివసించు రైతులు అనేక మంది ఆకలి బాధకు తాళలేక, కుటుంబాలతో బయలుదేరి గోపాలగంజ్ చేరుకుంటున్నారు. జిల్లా అధికారి వద్దకు రాయబారం వెళ్ళబోతున్నారు. స్థానిక జిల్లా కాంగ్రెసు కమిటీ వారికి సహాయ పడుతోంది. చిట్టగాంగ్ జిల్లాలో ఒక గ్రామంలో 58 మంది, గ్రామస్థుల యిండ్లలో, ప్రభుత్వోద్యోగులు దౌర్జన్యంగా ప్రవేశించి, ధాన్యాన్ని పాడుచేసి వెళ్ళినట్లు శ్రీ శరత్‌చంద్ర బోసుగారికి టెలిగ్రాం వస్తే, విచారణచేసి వచ్చుటకు కొంతమంది కాంగ్రెసు వారిని అక్కడికి పంపారు.

సంస్కరణలు.

బెంగాల్ రాష్ట్రంలో ప్రభుత్వోద్యోగుల జీతాలు, పింఛన్లు తగ్గించబోతున్నాం అని బెంగాల్ ప్రభుత్వం ప్రకటించింది. చిట్టగాంగ్ జిల్లాలో మద్యపాన నిషేధాన్ని ప్రవేశ పెడుతున్నాం అని కూడా ప్రకటిస్తోంది. శాసన సభ్యులను పోలీసులు ఎరస్టు చేయకుండా కాపాడు బిల్లుకూడా ఒకటి తేబోతున్నాం అనియు; పంటలు లేక బాధపడే రైతులకు ప్రభుత్వం చౌక వడ్డీలకు అప్పులిస్తాం అనీ, 7 లక్షలకు పైగా ప్రత్యేకించబడినా యనియు తెలియ జేస్తున్నారు.

ప్రత్యేకాధికారం.

సరిహద్దు కాంగ్రెసు మంత్రివర్గంవారు 124 A., 144 Cr. P. C. మొదలైన నిరంకుశ శాసనాలను రద్దుచేస్తూ తీర్మానించి, గవర్నరుయొక్క అనుమతికి పంపించారు. అతడు తనకున్న ప్రత్యేకాధికారాన్ని ఉపయోగించి, అనుమతి నిరాకరించాడు. మంత్రివర్గానికి క్లిష్టస్థితి యేర్పడింది. కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరించినప్పుడు వైస్రాయి ఒక వాగ్దానం యిచ్చాడు. సాధారణంగా గవర్నర్లు మంత్రుల సలహా ప్రకారమే పెళ్ళుతారని ఒక "అస్యూరెన్సు" యిచ్చిన తరువాతనే కాంగ్రెసువారు మంత్రిత్వ స్వీకారానికి అంగీకరించారు. సరిహద్దు రాష్ట్రంలో ఆ అస్యూరెన్సు యేమయిందో, నిరంకుశ శాసనాలను రద్దుచేయుట అంత సులభమైన దికాదని దీన్ని బట్టి తెలుస్తుంది. బ్రిటిషు సామ్రాజ్యవాదుల వదాలి! ప్రతినిధి అయిన గవర్నరు దీనికి బాధ్యుడు. కాంగ్రెసు మంత్రులుకాదు. పెద్ద ప్రజా ఉద్యమం లేనిదే ఆ మంత్రులైనను యేమియు చేయలేరని స్పష్టపడింది.

సింధు రాష్ట్రం

సక్కూర్ ఆనకట్ట క్రింద పండే భూములకు రీసెటిల్మెంటుచేసే కాలం వచ్చింది. సింధు రాష్ట్రంలో మంత్రులు యునైటెడ్ పార్టీకి చెందినవారు. పన్నులు హెచ్చు చేయకూడదని ఆపార్టీ తీర్మానించింది. కాంగ్రెసువారు కూడా అదే తీర్మానం ప్యాసుచేశారు. కాని, మంత్రులు హెచ్చించుటకు తీర్మానించారు. దీనితో క్లిష్ట పరిస్థితి యేర్పడింది. మంత్రులు రాజీనామా నీయవలసి వచ్చింది. కాని, తాత్కాలికంగా యీ స్థితినుండి తప్పించుకోగలిగారు. పన్నుల హెచ్చింపువల్ల యిబ్బందులేవో ప్రజలనుండి తెలుసుకోవడానికని రెండు నెలలు వాయిదా వేశారు. కాని, అగడువు పూర్తిఅయాక మరల క్లిష్టదశ తప్పదు.

సి. పి. మంత్రుల రాజీనామా.

మధ్య పరగణాలలో కాంగ్రెసు మంత్రుల ఐకమత్యం చెడింది. ప్రధాన మంత్రికి నిర్దిష్టమైన పరిపాలనా శాఖలను ఈయకూడదనియు, ఇతర శాఖలను సమన్వయించుటే అతని పని అనియు యితర మంత్రు లభిప్రాయపడు తున్నారు. ప్రధాన మంత్రి దీని కంగీకరించలేదు. ఇద్దరు మంత్రులు తమ అసమ్మతిని తెలియ పరచుచూ రాజీనామా యిచ్చారు. కాంగ్రెసు వర్కింగు కమిటీ యీ సమస్యను పరిష్కరించ బోతోంది.

సోషలిస్టు పార్టీ రద్దు కాదు.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీని రద్దు చేసుకొనుటకు సోషలిస్టు నాయకులు ఆలోచిస్తున్నారంటూ యీ మధ్య లక్నోనుంచి వార్తలు వచ్చాయి. పార్టీ ఉండరాదను వారి కోర్కెను చెల్లింపజాలమనియు, పైది వట్టి అసత్యవార్త అనియు జయ ప్రకాశనారాయణ, మసానీ మొదలైన పలువురు సోషలిస్టు నాయకులు ఖండించారు.

బూజుకట్టిన మాటలు.

నెహ్రూగారి అభిప్రాయాలు ఇండియాలో 100 కి 90 మంది ప్రజల అభిప్రాయాలు కావనియు; ఇండియా "అడకువగలిగి, ఉపయోగకరంగా సహాయము చేయు దేశం"గా ఉండగలదనియు; సామరస్యంచేత ఇండియా ప్రజలచే ఫెడరేషను అంగీకరింపజేయ వచ్చుననియు లండనులో వెల్లింగ్డన్ ప్రభువు పూర్వపు వైస్రాయి పలికాడు.

ఇట్టి మాటలు ఎందరో అన్నారు: బూజు పట్టిపోయి ఉన్నాయి. ఇది 1938 వ సం॥ అని వెల్లింగ్డన్ గ్రహించలేక పోయినందుకు జాలి.

రైతులోకం

# వివిధ రాష్ట్రాలలో రైతు వుద్యమం

## యు. పి.

రైతాంగ చిత్తు చట్టమును గూర్చి చర్చించి, సూచనలను ప్రభుత్వమునకు పంపుటకై ఆచార్య నరేంద్రదేవ్, అజిత్ ప్రసాద్ జైన్ (పార్లమెంటరీ కార్యదర్శి) మొ॥ వారుగల రాష్ట్రీ కాంగ్రెసు ఉప సంఘము ఏర్పర్చబడెను. శిస్తులలో 50% తగ్గించవలెనను ముందు రోజు యం. యన్. రాయిగారి తీర్మానమును ప్రధాన మంత్రి పంతుగారు, గౌ॥ కిద్వాయిగార్ల అభ్యంతరము పై పునర్విచారించి రాష్ట్రీ మొత్తం మీద 8 కోట్ల రూ. శిస్తులను తగ్గించవలెననీ, శిస్తు తరములను బట్టి ఈ తగ్గింపును అమలుబర్చ వలెననీ రాష్ట్రీ కాంగ్రెసు సంఘము తీర్మానించినది.

అదే సమయంలో జమీందార్ల సభ అలహాబాదులో సమావేశమై ప్రభుత్వపు టెనన్సీ బిల్లును నిరసిస్తూ, తమకున్న "సరీ" హక్కులను తగ్గించుట అక్రమమని తీర్మానించిరి. ఒక సంవత్సరం రైతు శిస్తు బకాయిపడి వున్నచో అతని కౌలును రద్దు చేయాలని ప్రభుత్వమును కోరుచున్నారు.

జలౌన్ జిల్లాలోని రాంపుర, జగ్మన్‌పుర, గోపాల్‌పుర ఎస్టేటులలోని రైతుల పన్నుల నిరాకరణ ప్రభుత్వము యొక్క మధ్యవర్తిత్వము ద్వారా ఆపివేయబడెను. రాజీ ఫలితంగా ప్రభుత్వం తెచ్చు టెనెన్సీ బిల్లు ననుసరించి, శిస్తులను వసూలు చేయుటకై ఒక ప్రత్యేక చట్టమును చేయుటకు జమీందార్లు అంగీకరించిరి. రైతులు సంతృప్తిపడి శిస్తులను సక్రమంగా చెల్లిస్తున్నారు.

రాణియా గ్రామంలోని ఒక పెద్ద భూస్వామి హత్య చేయబడెనట. అతని కళ్లు పీకివేయబడెను. అంగములు ఛేధింపబడి యుండెను. భూస్వామికిన్నీ బాకీదార్లకున్ను గల తగాదా ఫలితంగా ఇది జరిగిన దని తలపబడు చున్నది.

బెనారస్ జిల్లాలో జమీందార్లు తమ సొంత భూములనుంచి కౌలుదార్లను బలవంతంగా తొలగిస్తున్నారు. రైతులు నిరాకరిస్తున్నారు. కలహాలు యేర్పడుతున్నాయి. కాబట్టి, జిల్లా కలెక్టరు, జిల్లా కాంగ్రెసు కమిటీ. జమీందార్ల సంఘం కలిసి నోటీసులు జారీచేశారు. ఇకముందు జమీందార్లెవరూ తమ సొంత భూముల నుండి రైతులను బలవంతంగా వెళ్లగొట్టకూడదు. అవసరమైతే కోర్టులలో దావా చేసుకోవాలి, అదేవిధంగా వెళ్లగొట్టబడిన రైతులు తిరిగి వారు సాగుచేస్తూన్న భూములను స్వాధీనం చేసుకోకూడదు.

ఉనావో జిల్లాలో కూడా యిదేపరిస్థితి. రైతులను జమీందార్లు దౌర్జన్యంగా భూములనుండి తొలగిస్తున్నారు, జిల్లా కాంగ్రెసు కమిటీయొక్క సమావేశంలో దాన్ని గురించి 5 గంటలకాలం చర్చ జరిగింది. వెంటనే సత్యాగ్రహం ప్రారంభించుటకు తీర్మానం చేసింది. కాని, రా. కాం. కమిటీయొక్క అనుజ్ఞను కోరుతూ కూడా తీర్మానించ బడింది. జిల్లాలో అనేకచోట్ల రైతులు జమీందార్లకు వ్యతిరేకంగా ఊరేగింపులు మొదలైనవాటిని జరుపుతూ, పన్నులీయవద్దని బోధించినందుకు చాలామంది రైతులపై జిల్లా మేజస్ట్రీటు 107 వ శెక్షన్ ప్రకారం నోటీసులు జారీచేశాడు.

## పంజాబు.

పంజాబ్ శాసనసభలో రైతులకు సంబంధించిన బిల్లులు నాలుగు ప్రవేశపెట్టబోతున్నారు. తనఖా భూముల విడుదల బిల్లు ఒకటి, ఋణ పరిష్కార బిల్లు మరొకటి, భూస్వాధీన బిల్లు యింకొకటి, మార్కెటింగు బిల్లు మరొకటి.

పంజాబులో మొత్తం 55,000 మంది ఋణదాతలున్నారు. ఒక్కొక్క ఋణదాతకు 300 మంది ఋణస్థుల చొ॥న ఉన్నారు. మొత్తం 200 కోట్లకు పైగా వ్యవసాయదార్ల ఋణం ఉంది. ఇకముందు పంజాబులోని ఋణదాతలు గవర్నమెంటు వద్ద లైసెన్సులు పుచ్చుకోకుండా వ్యాపారం చేయరాదనియు, నిర్దిష్టమైన రేటును దాటి వడ్డీకి ఈయరాదనియు బిల్లులోని ప్రధానాంశములు.

భూమిని కలిగియుండి, వడ్డీ వ్యాపారం చేసే ఋణదాతలకు కూడా వర్తించునట్లు మరొక బిల్లు ఉంది. అది భూమి అన్యాక్రాంత చట్టం కు సవరణ బిల్లు. దాని ప్రకారం, యే రైతు దగ్గర ఋణమునకు గాను భూమిని యే భూస్వామి స్వాధీన పరచుకొన గూడదు.

పంజాబు రాష్ట్రిమందలి భూములన్ని చిన్న చిన్న పీలికలైపోకుండా కాపాడుటకు మరొక బిల్లు ప్రవేశపెట్ట బడుతోంది. 3 జిల్లాలలో 30,000 యకరముల విషయంలో పూర్వపు ఆక్టు అనుకూలంగా వర్తించింది. ఇప్పుడు రాష్ట్రిమంతటికిని వర్తింప జేయాలని బిల్లు యొక్క ఉద్దేశం.

నాల్గవ బిల్లు రైతుల మార్కెటింగుకు సంబంధించినది. దాని ప్రకారం, రైతుల ధాన్యం సులభంగాను, యిప్పటికంటె ఎక్కువ ధరలకు అమ్మే సదుపాయములు గవర్నమెంటే చేస్తుంది.

పై నాలుగు బిల్లులు షాహుకార్లకు సహజంగా రుచించలేదు. కాబట్టి సిమ్లా, లయల్పూరు, అమృతసర్, జలందర్ మొదలైన పట్టణాల్లో హర్తాళ్ చేశారు.

లయల్పూర్ జిల్లా రాజకీయ మహాసభలో రైతుల భూమి శిస్తును 100 కి 50 చొ॥న తగ్గించాలనిన్నీ, ఇన్‌కంటాక్సు పద్ధతిని రైతుల ఆదాయమును బట్టి పన్ను విధించాలనిన్నీ తీర్మానాలు ప్యాసయాయి. పంజాబు ప్రభుత్వం, రైతులకి సౌకర్యాలు కల్గించడం, వారిని సైన్యాలలోనికి చేర్పించడానికే. ప్రతిరైతు సభలోను ప్రధానమంత్రి, ప్రభుత్వ పక్షం వారు ఈ ప్రచారం సాగిస్తున్నారు. కాని కాంగ్రెసు రాష్ట్రాలలోవలె రైతులపై దయి చేతగాదు ఇవి చేసేది.

## మధ్యపరగణాలు

సొహావాల్ సంస్థానంలో సంస్థానోద్యోగులు రైతులవద్ద పన్ను వసూలు చేయుటకు వెళ్ళారు. అక్కడ వారికి రైతులకు కలహం జరిగి, రైతులమీద తుపాకులు పేల్చబడ్డాయి. 5 రు రైతులు చనిపోయారు.

నీమార్, సియోనీ డివిజన్లలో కాంగ్రెసు మంత్రి వర్గంవారు పుల్లరి రేట్లు చాలవరకు తగ్గించారు. రైతులకు కొంత సదుపాయం కలిగింది.

## బీహార్

జులై 15 వ తేదీ నుంచి బీహార్ ఋణదాతల చట్టం అమల్లోకి వస్తుంది. 100 కి రు 9 ల కంటె ఎక్కువ రేట్లకు ఋణము లీయకూడదు. పూర్వపు కాంపౌండువడ్డీ నోట్లు రద్దవుతాయి.

జమీందార్లకు కాంగ్రెసు మంత్రులకు జరిగిన రాజీ ప్రకారం రైతులు సరిగా తమకు పన్నులు చెల్లించుటలేదని అనేక మంది జమీందార్లు కంప్లెంటు చేస్తున్నారు. చట్టప్రకారం రైతులు పన్నులను చెల్లించి వేయాలని కాంగ్రెసు మంత్రులు హెచ్చరిస్తున్నారు. 6 నెలలలోపుగా జమీందార్లకు రావలసిన బాకీలు రాకపోతే కొత్త చట్టం ప్యాసుచేస్తామని గవర్నమెంటు అభయమిచ్చారు.

గయ జిల్లాలో యీమధ్య స్వామీ సహజానంద సరస్వతి పర్యటనంచేసి తన అనుభవాలను పత్రికలలో ప్రకటించాడు. కాంగ్రెసువారు మంత్రులైన తరువాత కొన్ని వందలమంది రైతులపై 107, 109 సెక్షన్ల ప్రకారం ఎరస్టు చేశారు. కొన్ని గ్రామాలలో గూర్ఖా సైనికులు బీద రైతులపై కాపలాకాస్తున్నారు. పోలీసులు జమీందార్ల పక్షం వహించి రైతులకు అపకారం చేస్తున్నారు. ఈ జిల్లాలో అరాజకం (lawlessness) ఎక్కువగా ఉన్నదని కాంగ్రెసు మంత్రులూ జమీందార్లు అంటున్నారు. కాని దీనికి జమీందార్లు, గూర్ఖాలు కారణం.

బీహారులో జమీందార్లకున్ను, కాంగ్రెసుకున్ను రాజీ కుదుర్చుటకై తాము ప్రయత్నించెదమని అబ్దుల్ కలాం అజద్, సర్దార్ పటేల్‌గార్లు మంత్రి వర్గము వారికి తెలియజేసిరట. కాని మంత్రివర్గము ఇతర రాష్ట్రీ కాంగ్రెసు నాయకులతో ఆలోచించిన పిమ్మట రాష్ట్రేతరుల జోక్యం అనవసరమనీ, రాజీ ప్రయత్నాలేమైనా జరుగ వలసిన యెడల సెలక్టు కమిటీయే అందుల కర్తలనీ చెప్పి పటేలుగారి సహాయాన్ని నిరాకరించుట, రాష్ట్రీ కాంగ్రెసు సభలో వెల్లడియైన కాంగ్రెసు సామాన్య సభ్యుల దృక్పధం చూస్తే రాజీకి ఎట్టి అవకాశాలు లేవు.

## సింధు

సింధునది యొక్క ఆనకట్ట క్రింద సాగుచేయబడే భూములకు ఎక్కువ పన్ను వేయాలని మంత్రివర్గం యొక్క నిర్ణయం. కాని, శాసనసభ్యులలో అధిక భాగం దీనిని వ్యతిరేకించారు. మంత్రులు రాజీనామా ఈయవలసిన పరిస్థితులుకూడ యేర్పడ్డాయి. కాని, రెండు నెలలవరకు యీ సమస్య వాయిదా వేయుటద్వారా తాత్కాలిక పరిష్కారం జరిగింది. ఈ గడువు పూర్తిఅయాక తిరిగి క్లిష్టపరిస్థితు లేర్పడతాయి. పన్నులెక్కువ చేయవలసిందని కేంద్ర ప్రభుత్వం ఒత్తిడి తీసుకొనివచ్చుటే దానికి ప్రధాన కారణం.

## బొంబాయి

హుబ్లీజిల్లాలో సావుందత్తి తాలూకాలో రైతులు గవర్నమెంటుకు బాకీ ఉన్న పన్ను వసూలుచేయుటకు రివెన్యూ ఆఫీసరు కొంతమంది పోలీసులతోవెళ్ళినప్పుడు రైతులు (రాజగోపాలాచారిగారి సలహా ప్రకారం పన్నులు తీసుకువచ్చి ఈయకపోవడమే గాక,) పోలీసుల దగ్గర ఉన్న సంకెళ్లను లాక్కొన్నారు. వారిని ఎరస్టు చేయవలసిందని ఆర్డర్ చేయగా, పాపం ఆర్డర్ అమలు జరుగలేదు.

బొంబాయి శాసనసభలో ప్రవేశపెట్టబడు బిల్లులను గురించి చర్చించుటకు పూనాలో ఎసంబ్లీ కాంగ్రెసు పార్టీవారు సమావేశమయ్యారు. మొదటి బిల్లు జమీందారీ రైతుల భూస్వాధీన బిల్లు. బిల్లుయందలి ప్రధానాంశ మేమనగా, 100 యకరములకు తక్కువగా లేని జమీందార్ల భూములను ఏప్రిల్ 1937 నాటికి 6 సం. లకు పూర్వం నుంచీ రైతు సాగుచేస్తూంటే, అట్టివానికి భూమిపై శాశ్వతపు హక్కు కలుగుతుంది. అట్టి రైతు 1938 వ సం. కు పూర్వం రెండు సంవత్సరములు బకాయి పూర్తిగాను, అంతకు పూర్వపు బకాయి 4 సంవత్సరములలోను జమీందారుకు చెల్లించాలి.

రెండవ బిల్లు ఋణ పరిష్కారమునకు సంబంధించినది. దీని ప్రకారం, రైతులు 1932 నకు పూర్వం చేసిన అప్పులమీద 100 కి 30 చొ॥న బాకీ కొట్టివేసి, మిగిలినది ఋణదాతకు చెల్లించాలి. వెంటనే యీ మొత్తము నైనను చెల్లించుకొనే స్థితిలో లేనందున గవర్నమెంటే మొదట్లో చెల్లించి వేస్తారు. ఇందుకుగాను రు. 6 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ రు. 6 కోట్లు ప్రభుత్వం రైతుల వద్ద దీర్ఘ వాయిదాలపై వసూలు చేసుకొంటుంది.

ఈ సమావేశం జరుగుతూంటే, 60 మంది జమీందార్లు, యీనాందార్లు ఊరేగింపుతో వచ్చి, ప్రధాన మంత్రితో సంప్రతించారు. వారి అభిప్రాయము లేవో తెలిసికోకుండా ఎట్టి శాసనము చేయబడదని ప్రధాన మంత్రి వాగ్దానం యిచ్చాడు.



# ప్రధాని రాజగోపాలచారిగారి సుభాషితాలు

ఇప్పుడు దత్తమండలములలో కావలసినది తుంగభద్ర ప్రాజక్టు కాదు. కాలువలో నుంచి ఒక రైతు ఎక్కువ నీటిని తీసుకొంటే, మరొక రైతుకు కోపం వస్తుంది. అప్పుడతన్ని చంపవచ్చును. చివరకు మీకు సౌఖ్యం కలుగదు. దత్తమండలములలో నేరములు జరుగకుండా మాత్రం మీరు చూడాలి.

—కడప ఉపన్యాసం.

★ ★ ★

కాంగ్రెసు ప్రచారకులు, పోలీసులు సహోదరులు. మన దేశంలో ఇదొక చిత్రమైన ఐకమత్యం.

—కడప ఉపన్యాసం.

★ ★ ★

ప్రభుత్వోద్యోగులు, ప్రజలు కాంగ్రెసు హయాంలో ఒకే కుటుంబానికి చెందినవారు. మీరంతా నా సలహా కొరకు ఏ విధముగా నిరీక్షిస్తారో, పోలీసులు కూడా నా సలహాను కోరుతూ ఉంటారు. మీ వుభయులు ఒకరితో నొకరు కలహించుకొంటే, తల్లి తన బిడ్డల అన్యోన్య కలహాలను చూచి విచారించునట్లే నేను కూడా చాలా విచారిస్తాను. ఎవరు తప్పు చేశారో, ఎవరు చేయలేదో తల్లి ఒక జడ్జీవలె తీర్పు చెప్పలేద్దు ... నేనొక వితంతువు తల్లిని. ప్రజలు పోలీసులతోను పోలీసులు ప్రజలతోను కలహించుకొనుట నేను చూడలేను.

—కడప ఉపన్యాసం.

★ ★ ★

అడవుల యిబ్బందులను గురించి మీరు వ్రాశారు. ఈ సమస్య 25 జిల్లాలలోను ఉన్నదే. నీటి తీరువాయిని తగ్గించాలని కొందరడుగు తున్నారు. త్రాగుడు మాన్పించే యేర్పాటు చేయమని మరి కొందరడుగు తున్నారు. కాని, వీటి అన్నిటికి సొమ్మెక్కడిది?

—కడప ఉపన్యాసం.

★ ★ ★

నాకు ప్రజలు బలాన్ని చేకూర్చు నంతకాలం, గవర్నరు, ఇండియా సార్వభౌముడు నన్ను గౌరవిస్తారు.......

ప్రతి కాంగ్రెసువాది తాను జీతభత్యాలు లేని గవర్నమెంటు ఉద్యోగి అని భావించాలి. ప్రభుత్వోద్యోగులతో ప్రజలు 'కామ్రేడ్ షిప్పు' వృద్ధిచేసుకోవాలి. ఎందువల్లనంటే, ప్రజలను, ఉద్యోగులను యిప్పుడు నడిపేది ఒకరే. జీతాలు పుచ్చుకొను ఉద్యోగస్థులు, పుచ్చుకోని ఉద్యోగస్థులు ఒకరితో ఒకరు పోట్లాడుకోరాదు.

— బళ్ళారి ఉపన్యాసం

★ ★ ★

ఒకవ్యక్తి ఒక ప్రభుత్వోద్యోగికి లంచం ఎందుకిస్తాడంటే, తన యిరుగుపొరుగు వ్యక్తులతో అనవసరంగా పోటీపడి ఆపోటీలో తాను గెలుచుటకు. కాబట్టి ప్రజలెవ్వరూ యే ఉద్యోగికి లంచాలీయవద్దు.

— బళ్ళారి ఉపన్యాసం.

★ ★ ★

ప్రయత్నాలన్నీ పూర్తి అయ్యేవరకూ రాముడు సీతకొరకు యేవిధంగా వేచియున్నాడో, అదేవిధంగా నేను తుంగభద్ర ప్రాజెక్టును తెచ్చేవరకు మీరు వేచి యుండాలి..... ఒక శతాబ్దంలో యే గవర్నమెంటు తుంగభద్ర ప్రాజెక్టును కట్టలేకపోయిందంటే దానిలో యెన్ని యిబ్బందులున్నాయో బోధపడుతుంది. ప్రాజెక్టును కట్టినతరువాత ప్రక్కనున్న వివిధ ప్రభుత్వాలకు యెంతెంత నీటిని పంచిపెట్టాలో తగాదాలు వస్తాయి.

— బళ్ళారి ఉపన్యాసం

★ ★ ★

తుంగభద్ర ప్రాజెక్టు విషయమై చెప్పాలంటే, మైసూరు — హైదరాబాదువంటి సంస్థానాలు, బొంబాయి — మదరాసు ప్రభుత్వాలు మీయెడల ఎంతో స్నేహభావంగా ఉన్నాయి. అది మీఅదృష్టమే అని చెప్పాలి.

—అనంతపురం ఉపన్యాసము

★ ★ ★

నన్ను డిక్టేటరు అనీ. హిట్లర్—ముసులోనీ అనీ కొందరు పిలుస్తారు. కాని, మీరు నాకు సహాయం చేయాలి. నా అంతరాత్మ నన్నేమి చేయమని 'డిక్టేట్' చేస్తుందో దాన్ని విధిగా చేస్తాను. కాబట్టి కొంతమంది విరోధులు నన్ను వ్యతిరేకిస్తే, మిగిలినవారు నన్ను సమర్థించుటకు తయారుగా ఉండాలి.

— కడప ఉపన్యాసం

★ ★ ★

కాంగ్రెసు గవర్నమెంటు ప్రపంచ మంతటిలోనూ కీర్తి సంపాదించాలని మీరందరు కోరితే, నేను చెప్పినట్లు మీరు చెయ్యాలి. ఒక యింటినుంచి మరొక యింటికి తిరుగుతూ పన్నులు వసూలు చేయడం చాలా కాలంనుంచి అలవాటుంది. ఇప్పుడు నేనే పన్నులు వసూలు చేసేవాడిని, కాబట్టి మీరే స్వయంగా పన్నులు తీసుకువచ్చి ఈయాలి.... నేనొక ప్రజ్ఞగల మంత్రినని వైస్రాయి, మదరాసు గవర్నరు భావించాలంటే ఆవిధంగా మీరు నన్ను చేయవలసియుంటుంది.

—కర్నూలు ఉపన్యాసం

★ ★ ★

పోలీసుల అత్యాచారములను గురించి మీరు మీ మెమోరాండంలో వ్రాసారు. ఎవరో, ఎక్కడో అత్యాచారం చేస్తే, అప్పుడు పోలీసుల అత్యాచారం జరుగుతుంది. బహుశ మొదట విత్తనం యెవరో ఒక పొగరుబోతువల్ల నాటబడుతుంది. పోలీసులు కూడా ప్రజలనుండే వచ్చారు. పోలీసులయెడల మీకు గల కోపంవల్ల నేరమునకు కారకులైన ప్రజల సంగతి మరచిపోకూడదు.... మీరు పోలీసులకు లంచం ఈయరాదు. ఆవిధంగా మీరు వారిని పాడుచెయ్యవద్దు.

—అనంతపూర్ ఉపన్యాసం

★ ★ ★

పోలీసు మీలో ఎవరినైనా గెంటితే, నేనే గెంటితినని భావించండి.

—అనంతపూరు ఉపన్యాసం.

★ ★ ★

తక్షణమే ఆంధ్ర రాష్ట్రిం ఈయాలని మీరడుగుచున్నారు. అది నేనెట్లు ఈయగలను? మీ ప్రతినిధులిదివరకే అడిగారు. దురదృష్టవశాత్తూ నేను తమిళ దేశస్థుడను... కాని, ఒక విషయం మీరంతా జ్ఞాపక ముంచుకోవాలి. తండ్రి తన కూతుర్ని ఆమె భర్త యింటికి పంపునపుడు కన్నీటిని విడుస్తాడు. కూతురు తన భర్త యింటికి పోవుటకు సర్వవిధముల హక్కు కలిగి యుంటుంది. కాని తండ్రి సంతోషంతో పంపలేడు. ఆంధ్ర రాష్ట్రిం విషయంలో నేను కూడా అట్టి స్థితిలోనే ఉన్నాను.

—అనంతపూర్ ఉపన్యాసం.

కొంతకాలంలో ప్రతి ప్రభుత్వోద్యోగియు గాంధీ తత్వాన్ని జీర్ణించుకో గల్గుతాడని నాకు గట్టి నమ్మకం ఉంది. ఉద్యోగులకు ప్రజలకు మధ్య సహకారం అవసరం. ఎవరు తప్పుజేసి నప్పటికీ ప్రజలు లెక్కచేయకూడదు.

—అనంతపూర్ ఉపన్యాసం.

★ ★ ★

పోలీసులు కార్మికుల వెంట 'నిఘా' చూస్తున్నారంటే, వాళ్ళ డ్యూటీ వాళ్లు చేస్తున్నారు. దానిలో ఆక్షేపణ యేమియూ లేదు.

....సి. ఐ. డి. శాఖవారు రాజకీయ ప్రచారకులను వెంబడించుట కంటే ప్రభుత్వోద్యోగుల లంచగొండితనాన్ని కనిపెట్టుట కష్టం,

—బందరు ఉపన్యాసం.

★ ★ ★

కాంగ్రెసులోనే కాంగ్రెసు మంత్రులను విమర్శించే వారున్నారు. జస్టిస్ పార్టీ యిట్లుకాదు. పార్టీ అంతా మంత్రి వర్గము యొక్క వెనుకనే ఉండేది.

—బందరు ఉపన్యాసం.

★ ★ ★

శకుంతలయొక్క ఉదాహరణ నాకీ సందర్భములో ఎప్పుడూ గుర్తుకు వస్తూఉంటుంది. అవతల, శకుంతలను పంపేది పెంపుడుతండ్రి. శకుంతల వెళ్లేది సార్వభౌముని యింటికి. అయినప్పటికీ శకుంతల వెళ్లడం విరాగియైన కణ్వుడికికూడా దుఃఖము కలిగించిందని కాళిదాసు వర్ణించాడు. పైగా కణ్వుడికే ఇట్లావుంటే, మామూలు గృహస్థులకెట్లు ఉండునని ఆక్రోశించాడు. అనేక సంవత్సరాల క్రింద వ్రాసినప్పటికీ, కాళిదాసుయొక్క ఈ వాక్యం సనాతనమైన మానవ ప్రకృతిమీద ఆధారపడి ఉన్నందువల్ల నేటికి నీసత్యంగానేవున్నది. ఈ ఉదాహరణాన్ని ఎన్నెన్ని విధాలుగానైన ఆలోచించి చూడండి. అది ప్రస్తుత సందర్భానికి మాటుగా అతికినట్లు కనిపిస్తుందనడానికి సందేహం లేదు. కూతుళ్ళ విషయంలో ఎంతో మిత్రులు వగైరాల విషయంలోకూడ ఈ పరమసత్యం అంతగానే వర్తిస్తుంది.

ఆంధ్రరాష్ట్రిం మీకువస్తే, దుష్టులైన తమిళుల పరిపాలన మీకు వదిలిపోతుంది. నిజమే. కాని, నేను మీలో కలిసి ఉండడం పడదుకదా! మన ఉభయులకూ ఏమైనా సంబంధం ఉంటే, అది కాగితాలమీద ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా ఉండే సంబంధమే. నేను మీ కష్టసుఖాల్లో పాల్గొనడం, నామిత్రుడు పట్టాభి మీకష్టసుఖాల్లో పాల్గొనడం సంభవించదు.


— బందరు ఉపన్యాసం.

# వ్యవసాయ కూలీలలో ఎలా ప్రచారం చేయాలి?

## రైతుల అపోహలను పోగొట్టాలి! :: రైతు - కూలీల సామరస్యం బోధించాలి!!

శ్రీ మాదల వీరభద్రరావు

200 సంవత్సరాల బ్రిటిష్ ప్రభుత్వం పరిపాలనా ఫలితంగా మన హిందూదేశపు వ్యవసాయము క్షీణించి, క్రమేణా బీద రైతుల సంఖ్య ఎక్కువై యున్నది. వీరుగూడా హద్దులేని శిస్తులవల్ల, మక్తాలవల్ల ఎన్నడు తీరని అప్పుల వల్ల, ఉద్యోగస్తుల లంచగొండితనం వల్ల దివాలాతీసి సెంటు పొలంలేని వ్యవసాయ కూలీలుగా తయారగు చున్నారు. మన రాష్ట్రములో వ్యవసాయ కూలీల సంఖ్య రోజురోజుకు విపరీతంగా పెరిగిపోతున్నది. ఈ వ్యవసాయ కూలీల సంఖ్య తోపాటుగా బాధలు గూడా మితిమీరుచున్నవి. ప్రస్తుతం మన ఆంధ్రదేశంలో వ్యవసాయ కూలీ-రైతు వివాదాలు చెలరేగుచున్నవి. కూలీల్లో గల్గుచున్న సంచలనం వల్ల సమ్మెలు గూడా తీవ్రగతిని వృద్ధి చెందుచున్నవి. ధనిక రైతుల అపోహలకు తావులేకుండా బీదరైతు కూలీలు సఖ్యతకై ఎక్కువగా కృషిచేస్తూ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా, ధన స్వామ్యతత్వాలకు ప్రతికూలంగా పోరాటాన్ని సాగించాలి.

ఈ పోరాటం విజయవంతంగా సాగటానికి ఎవరెవరి సహాయం కావాలి?

గ్రామాల్లోని వ్యవసాయం మీద ఆధారపడ్డ ప్రజలను విభజించి, వారి స్వభావాన్ని గమనిద్దాం.

మొదట వ్యవసాయ కూలీలు. అంటే భూకామందులు. భూస్వాములవద్ద పాలేర్లుగా వుండిగాని, ఏరోజుకారోజు కూలీకి వచ్చిగాని కేవలం ఆకూలీ, ఆజీతాల వల్లనే జీవితాలు గడిపేవారు.

రెండవరకం చిన్న రైతులు, అనగా తమకున్న స్వంత స్వల్ప భూమిమీదగాని, మక్తా భూమి మీదగాని పనిచేస్తూ దానివల్ల తన కుటుంబ పోషణకు సరిపొయ్యే ఆదాయంరాక యితర కూలీ నాలీ చేసుకుంటూ బ్రతికేవారు. భూమిని సాగుచేయటానికి మనుష్యులను, పశువులను అన్ని ప్రదేశాలకు తిప్పుతూ ధన వ్యయ పరచాలి. అన్ని పొలాలకు కాపలా పెట్టాలి. మంచి ఎరువు యుపయోగిద్దామంటే డబ్బు వుండదు. అందువల్ల భూముల సారం తక్కువ. పంటలు తక్కువ. ఆదాయం తక్కువ, అంటే వీరు సగం కూలీలు సగం రైతులుగాను యున్నారు. యీ (Semi-Proletariat) తరగతియొక్క జీవిత పరిస్థితులు చాల కష్టంగా వుంటాయి.

ఇంక మూడోది చిన్న ప్రొప్రైటర్లు. ఈ రైతులు తమకున్న భూములవల్ల వచ్చే ఆదాయంతో సంసారం గడుపుతుంటారు. వీరు ఎస్టేటుదార్లకు, యినాందారీ, అగ్రహారం దార్లకు శిస్తున్నూ పంటలో కొంత భాగమున్నూ యిస్తూ వుంటారు.

భూస్వాములు వీరు ఉత్పత్తిలో ఏ విధంగా పాల్గొనకుండా పనినంతా కూలీలచేత, జీతగాండ్ర చేత చేయిస్తూ, కేవలం కర్ర పెత్తనం చేస్తూ వుంటారు.

సాగుబడిచేయక యితరులకు మగతాకిచ్చేవారు 100—5

స్వంత సాగుబడి చేయువారు 100—50

వ్యవసాయ కూలీలు 106—45

స్వంత సాగుబడి చేయువారిలో 3 రకాలున్నారు. (1) పెద్ద(ధనిక) రైతులు. (2) మధ్య తరగతి రైతులు. (3) చిన్న (బీద) రైతులు ఈ ధనిక రైతులు, మధ్య తరగతి రైతులు కలసి సుమారు 14 మందికన్నా ఎక్కువుండరు. వీరు మాత్రం భూస్వాములతో ఏకమై తమ క్రిందనున్న బీద రైతులను, కూలీలను నానా బాధలు పెడుతుంటారు. పిచ్చ మానికలతోను, ముంతలతోను ధాన్యం యిస్తూంటారు. బూతులు తిడుతుంటారు. వెట్టి చాకిరి చేయిస్తుంటారు. కఱ్ఱ దెబ్బలు కొడుతుంటారు.

అందువల్ల గ్రామాల్లో విప్లవపోరాటం అభివృద్ధి చెందాలంటే కర్రపెత్తనం చేస్తుండేవారి మీద క్రింద తరగతివారిని తిరుగుబాటు చేయించాలి. అందుకే వ్యవసాయ కూలీ సంఘాలత్యవసరం. యీ సంఘా లేర్పరచాలన్నా, వీరిలో పనిచేయాలన్నా అనేక ఆటంకాలను ఎదుర్కోవాలి. బీదరైతులు వీరి వుద్యమానికి వ్యతిరేకులు గాకుండా జాగ్రత్తగా వ్యవహరించాలి.

### వ్యవసాయ కూలీలలో పనిచేయు కామ్రేడ్స్‌కు మనవి.

1. ప్రతిసభకు గ్రామ రైతు సంఘమున్నచోట ఆ సంఘాధ్యక్ష కార్యదర్శుల సహకారంతో మీటింగు జరుగునట్లు చూడాలి.

2. మొదటి సభలు రైతు, కూలీ జాయంటు మీటింగుగా యుండాలి. (లేనియెడల రైతులలో లేనిపోని అపోహలకు కారణమగును.)

3. సభా ప్రారంభంలో కూలీ పాటలతో పాటు విడిగా రైతు పాటలను కూలీ, రైతు నినాదాలను (Slogans) యిస్తూపాడాలి.

4. అర్థంకాని మాటలువాడక వాడుకభాషలో విపులంగా బీదరైతులకు, కూలీలకు సులభంగా అర్థమయ్యే భాషలో మాట్లాడాలి.

ఉపన్యాసాలు యీ వివరాలతో కూడినవై క్రిందివరుస క్రమంతో వుంటే మంచిది.

5. మొదట బ్రిటిష్ సామ్రాజ్యవాదులుచేసే దోపిడి విధానాన్ని గురించి, జైళ్లు, అర్డినెన్సులు, నిర్బంధ విధానాలు, ఉదాహరణలుగా చూపుతూ క్లుప్తంగా మాట్లాడాలి.

6. ప్రభుత్వ పాలనవల్ల రైతుల బీదస్థితిని చెప్పి, ఎంత చెల్లించినను తీరని అప్పులు, అంతు పొంతులేని శిస్తులు మొదలగు ఆర్థిక పరిస్థితులగూర్చి విపులీకరించాలి.

7. రైతుల దారిద్ర్యాన్ని గురించి చెపుతూ పెద్ద రైతులు బీదరైతులుగాను, బీదరైతులు వ్యవసాయ కూలీలుగాను ఎలా తయారగు చున్నారో నచ్చచెప్పాలి.

8. తర్వాత కూలీ కష్టాలనుగురించి అంటే పిచ్చ మానికలు, తక్కువ కూలీ, ఎక్కువ కాలం పనీ, బూతులు, వెట్టిచాకిరి, నాముపద్ధతి, కర్రదెబ్బలు, జరిమానాలు, ఇంకా స్థానిక విషయాలను గూర్చి వివరించాలి.

9. యీ అన్యాయాలు బీద రైతులు తెలిసి జేసే పనులుగావని దీనికంతా కారణం రైతుల అజ్ఞానం, విద్యావిహీనత, పత్రికా పఠనం లేకపోవడం వల్లననీ చెప్పుచుండాలి.

10. రైతుల బీదతనానికి కారణం కూలీలకిచ్చే కూలిగాదనీ, దీనికంతా ఉద్యోగుల లంచాలు, ప్రభుత్వ శిస్తులు, వడ్డీ వ్యాపారస్తుల బాకీలు, కరణం; మునసబు, ప్రైవేట్లకిచ్చే చాటులంచాలు మొదలగునవి ముఖ్యకారణములని గ్రహించక తెలివితక్కువ రైతు తనకు చేదోడు వాదోడుగా, కంటికి రెప్పగాయున్న కూలీలతో విరోధభావము వహించుచున్నారన్ని, అది కూడదని మందలించాలి.

11. సోవియట్ యూనియన్‌ను ఉదాహరణంగా చూపుచూ ప్రస్తుతం అక్కడ నిరుద్యోగం, ఆకలిమంటలు, బీదరికం లేకపోవటానికి కారణం, కూలీ రైతులు కలసిచేసిన విప్లవమేనని వివరించాలి.

12. కాన రైతులకు రైతు సంఘాలు, కూలీలకు కూలీ సంఘాలు తప్పక ఉండాలనీ, ఈ వర్గ సంఘాల ద్వారా వీరిద్దరిని దోపిడీ చేయుచున్న భూస్వాములకు, వడ్డీ వ్యాపారులకు, సామ్రాజ్య ప్రభుత్వమునకు వ్యతిరేక పోరాటం సాగించాలనీ చెప్పాలి.

13. ప్రచారకులు ఒక్క రైతు మనుష్యులు కారనీ, ఒక్క కూలీ మనుష్యులు గారనీ పీడిత ప్రజల హక్కులకై పోరాటం సాగిస్తామనీ స్వరాజ్యమనగా రైతు రాజ్యమే కాదనీ, కూలీల సహాయంతో రైతులు పోరాడాలనీ, లేని యెడల రైతు కోర్కెలు నెరవేరవనీ తిరుగుబాటు విఫలమౌతుందనీ ప్రపంచ సమస్యలు ఉదాహరణం చూపుచూ తెలియజేయాలి.

14. మత, పూజా విషయాలలో జోక్యం కలుగ జేసుకోమని చెప్పాలి. కాని కర్మ సిద్ధాంతం మీదనే ఆధారపడవద్దనీ, బీదరికానికి కారణం బ్రహ్మవ్రాత కాదనీ. ప్రభుత్వం రాజ్యాంగ వ్యవస్థయే కారణమని చెప్పాలి.

15. రైతులే కూలీలకంటే హీన పరిస్థితులలో యున్నారనీ కూలీలు రోజుకు రు 0-4-0 డబ్బులతో హాయిగా జీవనం చేయుచున్నారనీ అడుగుతున్నప్పుడు ఎలా, రైతులు, కూలీలకంటె మంచి జీవనం కల్గియున్నారో చెప్పి, వారిద్దరి దుస్థితికి కారకులెవరో చెప్పాలి.

16. సాంఘికంగాను ఇతర విధానాలతోను అందరు మాలమాదిగలను ఒత్తిడి చేస్తుంటే వారంతా ఏ విధంగా జాతీయ ఉద్యమానికి దూరమై పోతున్నారో ప్రభుత్వము యీ కూలీలను ఎలా ఉపయోగించుకుంటూరో తేటతెల్లము చేయాలి.

17. ప్రతి సభలోను ప్రపంచ కూలీ, రైతుల జండాయగు ఎఱ్ఱజండాను గురించి ప్రపంచంలో రక్త పతాక గౌరవాన్ని గురించి చెప్పాలి.

18. కూలీలకు కావలసినది ప్రస్తుతం కనీసపు వేతనాలు, మర్యాదగా మాట్లాడుట, కొట్టటం, బూతులు మానటం, ఇంతేగాని రైతుల మీద నిరంతరం ఒత్తిడి చేయటం, అంతూ పొంతూ లేకుండా కూలీ పెంచుకుంటు పోవటం, బీద రైతుల పొలాలు పంచుకోటం ఇవి మాత్రం కావని స్పష్టంగా వివరింపాలి.

19. తగాదాలు తప్పని సరియైనప్పుడు రాజీలన్నీ విఫలమైనప్పుడు పై సంఘాల ద్వారా అనుభవం గల రైతు, కూలీ సేవకుల ద్వారా పరిష్కరించుకో వలెనని చెప్పాలి.

20. సభలలో 5, 6 మిత్రులు ఉపన్యసించే కంటే ఒక్కొక్క సభలో ఒక్కొకరు విపులముగా అసలు విషయాన్ని బోధపడేటట్లు వాడుకభాషలో మాట్లాడాలి.

21. ప్రతి సభ ముగించబొయ్యే ముందు అక్కడున్న బీద రైతులను, కూలీలను ప్రశ్నలువేయమనీ అనుమానాలతో యిండ్లకు వెళ్లవద్దనీ బ్రతిమలాడాలి.





# పీడిత కార్మికులకు సమ్మెయే అంతిమ సాధనము

## ★ వివిధ రాష్ట్రాల సమ్మెల విజృంభణం ★
## యజమానుల దాడీ—నిరుద్యోగ దారిద్ర్యాలే
## కార్మికుల అశాంతికి కారణాలు

### రైల్వే కార్మికులు

**గ్యాంగు కూలీకి ప్రమాదము.**

బెజవాడ లోకోషెడ్డువద్ద కొత్తరకం పాయికానా దొడ్డి కట్టుతున్నారు. 12-7-38 తేదీన గ్యాంగువారు భూమిలో దింపిన కమ్మీలను లాగుచున్నారు. ఆరోజున తాడేపల్లి నుంచి, పి. డబ్లు. యిన్‌స్పెక్టరుగారితో మాట్లాడుటకు శేషను మేస్త్రీ మోసన్నగారిచే పంపబడిన అంజయ్య అనే గ్యాంగుకూలి వచ్చాడు అక్కడికి. యిన్‌స్పెక్టరుగారు అతనికి కూడా పని జెప్పారు. పుల్లీ తాడుతో కట్టబడి యుండుట చేత, అది తెగి పైనవున్న పుల్లీ, అంజయ్య తలపై పడెను. తలమీద ప్రమాదమైన దెబ్బ తగిలెను.

అధికారులు అశ్రద్ధగా వుండుటచేతను, అనవసరముగా పనులు జెప్పుటచేతను, అమాయకపు కార్మికులు దెబ్బలకు పాలుగావలసి యున్నది. రైల్వే అధికారులు గ్యాంగు కూలీకి తగిన నష్టపరిహారము యివ్వాలి.

**రైల్వే కార్మికులలో కొంతమందిని తగ్గించుట.**

రైల్వే అధికారులు కార్మికులలో కొందరిని తగ్గించాలని ప్రయత్నాలు చేయుచున్నారు. ఉద్యోగస్థు లందరిలోకి కొద్ది జీతగాండ్రైన గ్యాంగువారిని తగ్గించుచున్నారు. ప్రస్తుతము ప్రతి మూడుమైళ్ళ దూరంలో 9 మంది గ్యాంగు కూలీలు పనిజేయుచున్నారు. క్రొత్తగా అధికారులు (Mobile gangs) తిరుగుడు గ్యాంగులను ఏర్పాటుజేయుచున్నారు. కోటిపల్లి బ్రాంచి; గుంటూరు-తెనాలి; భీమవరం-నరసాపురం; నిడదవోలు—భీమవరం, లో. అమలులోకి వచ్చినాయి. ఈవిధంగా మూడు గ్యాంగులను కలిపి; అందులో 20 మంది గ్యాంగు కూలీలు ఒక మేస్త్రీతో పనిచేయించ ప్రారంభించారు. పనిజేయు లైనుపొడుగు పెంచారు. పనివారలను తగ్గించారు. ఆ బ్రాంచీలలో మిగిలిన గ్యాంగు వారిని యితరచోట్లకు సర్దినారు. పనిలోనుంచి రిటైరుగాని ఆన్‌ఫిట్టు అయినవారి స్థానే క్రొత్తవారిని నియమించకుండా వీరిని పంపుచున్నారు. ఈవిధంగా యం.యస్.యం. రైల్వేలో అమలుపరచిన యెడల దాదాపు 3000 మంది గ్యాంగు కూలీలు తగ్గిపోతున్నారు. మూడవవంతు (1/3) గ్యాంగు కార్మికులు తగ్గిపోవచ్చునని అంచనా వేయవచ్చును. రైల్వే దొరలు పనివారలను యీవిధంగా తగ్గించాలని ప్రయత్నించు చున్నారు.

రైల్వే కార్మికులు, రైల్వే దొరలయొక్క నిరంకుశ కృత్యములను ఎదుర్కొనవలసి యున్నది. రైల్వే పనివారల యూనియను తీవ్రమైన ఆందోళన సాగించింది. పెరంబూరు బ్రాంచివారు, రెండు శాఖల్లలకు చెందిన గ్యాంగువారు మీటింగులు ఏర్పాటుచేసి తమ అసమ్మతిని తెలియబరచు చున్నారు. బెజవాడ బ్రాంచివారు ప్రతి శాఖకును మీటింగులు ఏర్పాటుజేసి అధికారులయొక్క ప్రయత్నములను ఎదుర్కొనుటకు గొప్ప ప్రచారం సాగించారు.

తిరుగుడు గాంగులు ఏర్పాటుజేసిన చోట్ల గ్యాంగు కూలీలలో తీవ్రమైన అసమ్మతి ప్రబలు చున్నది. తక్కువమంది పనివారలు, ఎక్కువ పని జేయాలని వస్తున్నది. ఇందుచేత రైల్వే లైను సరిగా వుండకపోవటం — ప్రయాణీకులకు యిబ్బందులు, రైళ్ళు పడిపోవుటకు అవకాశం ఎక్కువగా వుంది.

**టిక్కెట్టు కలెక్టర్లు.**

బెజవాడ డిస్ట్రిక్టులో వున్న టిక్కెట్టు కలెక్టర్లందరికి, డి. టి. యస్. గారు T 20 (సంజాయిషీ అడగటం) యిచ్చారని తెలియుచున్నది. వారిని సంజాయిషీ అడగటానికి కారణం వారు, ఎక్కువమంది టిక్కెట్టు లేకుండా వచ్చేవారిని, పట్టుకొని డబ్బు వసూలు చేయలేదని, ఎక్కువ లగేజి చార్జీలు చేయలేదని, టిక్కెట్టు కలెక్టర్లు అధికార్ల వత్తిడికి గాను ప్రయాణీకులను యిబ్బంది పెట్టి వారి సామానులను తూకమేసిన యెడల, ప్రయాణీకులు మరల డి. టి. యస్. గారికి వారిపై రిపోర్టు చేయడం, వెంటనే ఆ టిక్కెట్టు కలెక్టరు మీద కఠిన చర్య తీసుకోటం జరుగుతున్నది. అధికారులు, క్రింది వుద్యోగస్తులను యీ విధముగా యిబ్బంది పెట్టి, వారిని ఇతర చోట్లకు మార్చటం, మొదలగునవి జేయటం వల్ల వారిలో అసంతృప్తి ఎక్కువగు చున్నది.

టిక్కెట్టు లేకుండా వచ్చే మనుష్యులను బట్టి, వారు వసూలు జేయవలసిన అదనపు డబ్బు ఆధారపడి యుంటుంది. టిక్కెట్లు లేకుండా ప్రయాణం జేసేవారు లేనప్పుడు, ఎక్కడనుంచి వసూలు జేయమంటారో దొరగారు. ఈ అన్యాయంను ఎదుర్కొనుటకు రైల్వే పనివారల యూనియన్ శ్రద్ధ పుచ్చుకోవాలి. యూనియన్ ద్వారా పై అధికారులకు టిక్కెట్టు కలెక్టర్ల యిబ్బందులను విన్నవించి వాటిని నివారించేందుకు ప్రయత్నించాలి.

### బెజవాడ

సుమారు 20 రోజులనుంచి సమ్మెచేస్తున్న కామేశ్వర్ అండ్ కో ప్రెస్ పనివారల యెడల సానుభూతిని తెల్పుటకు 13 వ తేదీన అన్ని ప్రెస్‌లలోని కార్మికులు పని మానివేసి సంపూర్ణమైన సమ్మె చేశారు. సాయంత్రం 4 గంటలకు కాంగ్రెసు జండాలతోను, ఎర్రజెండాలతోను ఊరేగింపు జరిగెను. సాయంత్రం జరిగిన బహిరంగసభలో సమ్మెదార్ల కోరికలను బలపరుచుచు తీర్మానములు చేయబడెను.

### ఏలూరు

మంజువాణి ప్రెస్ కార్మికులు సుమారు 20 మంది తమకు న్యాయముగా చట్టబద్ధముగా రావలసిన మూడు నెలల జీతమును యజమాని [illegible] ఈయనందున సమ్మె ప్రారంభించారు. ఇతర కార్మికులెవరు ఆ ప్రెస్‌లో పనిచేయ నిరాకరిస్తున్నారు.

మంజువాణి ప్రెస్ యజమానుల తరఫున పంపబడు అచ్చుపని యితర ప్రెస్‌లలో జరుగకుండా ఏలూరు కార్మిక సంఘం చూడాలి.

### చిట్టివలస

సుమారు రెండు నెలలనుంచి యిచ్చట జనపనార మిల్లులలో 3000 మంది కార్మికులు సమ్మె చేస్తున్నారు. యజమానులకు, కార్మికులకు మధ్య ఉన్న తగాదాను పరిష్కరించుటకు యస్. వి. రామమూర్తిగారిని ప్రభుత్వం పంపినది. రిపోర్టు రెండు మూడు రోజుల్లో తయారై వస్తుంది. మిల్లు కార్మిక సంఘం తరఫున జనరల్‌బాడి సభ జరిగి, కార్మికుల కోరికలు సఫలమయ్యేటంతవరకు సమ్మెను సాగించాలని తీర్మానాలు ప్యాసుచేయబడెను.

### మద్రాసు

కోయం బత్తూరులో జీతాలు ఎక్కువ చేయాలని ఈ వరకు ఏర్పరచిన కమిటీ నిర్ణయాలను అమలులో పెట్టడానికి లేదు. కమీషనరును ప్రభుత్వం పంపింది. కాని ఆయన విచారణ పూర్తికాకుండానే కొంతమంది మిల్లు యజమానులు మిల్లులను మూసివేశారు. కార్మికుల జీతాలను ఎక్కువ చేస్తే మేము యిదే చేస్తాం అని బెదరించారు.

రాధాకృష్ణ మిల్లులలో 27 రు కార్మికులను అకస్మాత్తుగా కారణం లేకుండా డిస్మిసు చేశారు. మా యిష్టం వచ్చిన చర్యను కార్మికులపై తీసుకొన్నప్పుడల్లా వెంటనే పోలీసుల సహాయం గ్యారంటీ చేస్తే అప్పుడు జీతాలు ఎక్కువ చేస్తాం అని యజమానుల సంఘం తీర్మానించింది.

కార్మిక సంఘం యీ బెదరింపులు చూస్తూ ఊరుకుంటే లాభం లేదనుకుంది. విచారణ కమిటీ సిఫార్సు చేసిన ప్రకారం జీతాలు ఎక్కువ చెయ్యకపోతే కార్మికులు జూలై 25వ తేదీనుండి సమ్మె ప్రారంభిస్తారని యూనియన్ నోటీసిచ్చింది.

సహనం ఉండాలని మాటిమాటికి హెచ్చరికలు చేస్తే లాభంలేదు. కార్మికులకు కావలసినది ఆకలిబాధ తగ్గడం. అది శీఘ్రేవరకు కొందరపడక మానరు. మంత్రులు త్వరలో ఈ విషయాన్ని గ్రహించిరి. కార్మికులకు సదుపాయం చెయ్యాలి. లేకపోతే సమ్మెతప్పదు.

పుదుచ్చేరినుండి పనిలేని కార్మికులు 3000 మంది బయలుదేరి త్రోవలో అనేకమంది అనేక గ్రామాల్లో ఆగిపోతూ, సుమారు 200 మంది మదరాసు వచ్చారు. పని కల్పించే వారు లేక తిండికి రోడ్లమీద బిచ్చమెత్తుకుంటున్నారు. త్రోవలో చెప్పరాని అనేక బాధలు అనుభ[illegible]

### బెంగాల్

కలకత్తాలో గవర్నమెంటు పెరిగ్రాపు వర్కుషాపులో 1500 మంది కార్మికులు పని చేస్తున్నారు. కార్మిక సంఘంలో తీవ్రంగా పని చేయుచున్న ముగ్గురను వర్కుషాపులో సరిగా పనిచేయుట లేదనే మిషమీద మేనేజరు డిస్మిసు చేశాడు. దాన్ని ఖండిస్తూ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు యాజమాన్యాన్ని బహిరంగ సభలు జరుగుతున్నాయి.

యూనియన్ కార్యక్రమం చట్టాలు సమ్మతమైనదిగాని, చట్ట విరుద్ధం కాదు. కాబట్టి యజమానులెప్పుడూ ఆ కారణాన్ని పైకి చెప్పరు. గవర్నమెంటు వర్కుషాపులోని ముగ్గురు కార్మికుల విషయమై మద్రాసు ప్రభుత్వం ట్రాంవే పనివారల విషయమున జరిపినట్లే బెంగాలు ప్రభుత్వం న్యాయమైన విచారణ జరపాలి.

### రాణీగంజ్

80 రోజులనుంచి సుమారు 1500 మంది కార్మికులు బీడీల ఫ్యాక్టరీలో సమ్మె చేస్తున్నారు. కారణం: నల్గురు కార్మికులను అన్యాయంగా పనిలోనుండి తొలగించుట. బెంగాల్ రా. కాం. కమిటీయొక్క సహాయ కార్యదర్శి విచారణ ఆఫీసరుగా అక్కడకు వెళ్ళాడు. స్థానిక ముస్లింలీగు మత సంబంధమైన పనిని విడిచిపెట్టి సమ్మెను చీల్చుటకు ప్రయత్నిస్తోంది 100 మంది మహమ్మదీయ కార్మికులుమాత్రం పనిలోకి వెళ్ళారు. కాని, 250 మంది మహమ్మదీయులు సమ్మెదార్లతో చేరారు. అక్కడి జిల్లా కాంగ్రెసు కమిటీ సమ్మెదార్లకు పూర్తిగా సహాయ పడుతోంది. స్థానిక కాంగ్రెసు నాయకులే సమ్మెను నడుపుతున్నారు. చుట్టుపక్కల బహిరంగ సభలు జరుగకూడదని నిషేధించబడింది. అనేకమంది సమ్మెదార్లపై కేసులు బనాయించారు. పోలీసు బందోబస్తు పూర్తిగా ఉంది. అయినప్పటికి, సమ్మెదార్లు శాంతంగా పికెటింగు చేస్తున్నారు.

బెంగాల్‌లో ఉన్నది కాంగ్రెసు మంత్రివర్గం కాదు కనుకనే జిల్లా కాంగ్రెసు కమిటీయొక్క ప్రయత్నాలు సఫలం కావడంలేదు. సమ్మెదార్ల సహాయం కొరకు కలకత్తాలో రాష్ట్రకాంగ్రెసు కమిటీయొక్క యాజమాన్యాన్ని బహిరంగ సభలు జరుగుతున్నాయి. అనారోగ్యంగాఉన్న సుభాష్‌బోసుగారు సమ్మెను బలపరుస్తూ పంపిన సందేశాన్ని మొన్నటి సభలో చదివారు.

### కలకత్తా

25 మంది పాకీ పనివారిని కార్పొరేషన్ అధికార్లు పనినుండి తొలగించడంవల్ల 400 మంది సమ్మె ప్రారంభించారు. కార్మిక ప్రతినిధులు కార్పొరేషన్ అధికారితో సంప్రదిస్తున్నారు.

### చైనా దే

చైనాడే, ఏలూరులో జరిగినట్లు ప్రకటించాము. అక్కడ జయప్రదంగా జరిగింది. 72—0—0 సంపగలిగారు.

ఆంధ్రదేశంలో ఇంకా రాజమండ్రి, తెనాలి, నెల్లూరులలో జరిగినట్లు వార్తలు వచ్చాయి. ఇంకా ఎక్కడనైనా జరిగినవేమోకాని మాకు వార్తలు రాలేదు. ఇక ప్రోవుచేసిన ధనము చూద్దామా నెల్లూరులో 1-13-0 వసూలుచేసినట్లు సోషలిస్టుపార్టీ కార్యదర్శి తెల్పుచున్నాడు. తక్కినచోట్ల ఎంత వసూలుచేశారో తెలియదు.

ఆంధ్రదేశంలో ఇన్ని కాంగ్రెసు సంఘాలు సోషలిస్టు, యువజన, విద్యార్థి సంఘాలున్నా "చైనా దే" ఇంత నియత్సాహకరంగా జరగడం విషాదకరం, ఇకనైనా సోషలిస్టు పార్టీసభ్యులు యువజన, విద్యార్థి సంఘాలువారు, తమ కార్యశక్తిని ప్రదర్శింతురుగాక.

— సంపాదకుడు.

★ ★ ★

### చేనేత పారిశ్రామిక సభ.

చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామిక ప్రథమ మహాసభ జులై 16 వ తేదీన గుంటూరులో జరిగింది.

ఆహ్వాన సంఘంవారు శ్రీ రాజగోపాలాచారి గారికి, బయ్యా సూర్యనారాయణమూర్తి గారికి అధ్యక్షులకు సన్మాన పత్రా లర్పించారు.

శ్రీ దామనాధం రామదాసుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా వుండిరి. రాజగోపాలాచారి గారు ప్రారంభోత్సవం సల్పారు. గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు అధ్యక్షత వహించారు.

ఆహ్వాన సంఘాధ్యక్షులు, చేనేత పారిశ్రామికులు మిల్లు పోటీలవలన ఎట్లు బాధపడుచున్నదీ, ఏయే విధములైన రక్షణలు చేనేత పారిశ్రామికులకు గావలసినదీ చెప్పిరి.

అధ్యక్షులగు హరిసర్వోత్తమ రావుగారు తమ దీర్ఘోపన్యాసంలో, చేనేత చరిత్ర – దాని జీవకళ మొదలుకొని ప్రస్తుతస్థితి వరకు అనేక చారిత్రక విశేషాలు తెలియ పరచారు. ప్రస్తుతము చేనేత పారిశ్రామికుల కెట్టి రక్షణ అవసరమో తెలియజేశారు.

★ ★ ★

### పోలీసులపై కంప్లయింటు.

ఒక పోలీసుపై లంచాలు పుచ్చుకుంటున్నాడని సాక్ష్యము చెప్పిన అవుల రాములు అను జట్కావానిని, ఆ పోలీసును, మరొక పోలీసును, గోదావరి స్టేషను నుండి రాజమండ్రీ స్టేషనుకు పోవుచుండగా పోలీసు టౌనుకు పిలచి, పొట్టపైన, వీపున, తనపైన, కర్రలతో కొట్టినారని, జట్కా డ్రైవర్ అగు అవుల రాములు కేసు పెట్టినట్లు రాజమండ్రి నుండి ఒక విలేఖరి తెల్పుచున్నాడు.

★ ★ ★

### పోలీసు జులుం

రాజమండ్రిలో ఒక పోలీసు కానిస్టేబుల్‌పై ఒక కేసు జరుగుతూంది. దానికి పోలీసు సబిన స్పెక్టరుగారగు శ్రీనివాసరావు పంతులుగారు, మన్నేపల్లి సూర్యనారాయణగారిని సాక్ష్యముగా వేసికొన్నారనీ, కాని వారు సబినస్పెక్టరుగారు చెప్పినట్లు అబద్ధపు సాక్ష్యమీయ నిరాకరించినందున వారి సాక్ష్యము పిలువలేదనీ, అప్పటి నుండి సబినస్పెక్టరు మనస్సులో క్రోధము పెట్టుకొని యున్నాడని, ఒకసారి గాడి నరసింహంఅను ఆయన, మన్నేపల్లి సూర్యనారాయణగార్ని కొట్టగా, వారు మేజిస్ట్రేటు కోర్టు వద్దకు కంప్లెయింటు చేసుకొన బోయినప్పుడు, పై సబినస్పెక్టరు కనపడి, తనకు గాడి నరసింహంగారి నుండి రిపోర్టు కలదుగాబట్టి సూర్యనారాయణగారిని అరస్టుచేసి చావదన్నుతానని బహిరంగంగా చెప్పినట్లును, తనను రక్షించవలసినదంటూ మన్నేపల్లి సూర్యనారాయణ గారు మేజస్ట్రేటుగారికి పిటిషన్ పెట్టుకొన్నారు.

★ ★ ★

### ప్రధాన మంత్రికి అడ్డుదగల లేదు.

అల్లరులకు విద్యార్థులు, సోషలిస్టులు బాధ్యులుకారు.

పత్రికా విలేఖర్ల తప్పుడు వ్రాతలు.

### గుంటూరు.

గుంటూరు పట్టణ విద్యార్థి సంఘతరపున సి. లక్ష్మీనారాయణ యువజన సంఘ కార్యదర్శి, సి. వి. సారధి, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి యం. తిరుపతయ్యగారలు ప్రధానామాత్యులైన సి. రాజగోపాలాచారిగారు వచ్చిన సందర్భమున గుంటూరులో జరిగిన డిమాన్‌స్ట్రేషనును గూర్చి యిచ్చిన స్టేట్‌మెంటు :—

ఈ నెల 16 వ తేదీన ఉదయం 10 గంటలకు మన ప్రధానామాత్యులు ఇక్కడకు విచ్చేసిరి. వారికి తగు స్వాగతం యిచ్చునిమిత్తం, గుంటూరులోని పైమూడు సంఘముల తరపున ఉదయం 8 గంటలనుంచి ఒక పెద్ద డిమాన్‌స్ట్రేషన్ బయలుదేరి 9 గంటలకు రైలు స్టేషనువద్దకు చేరిరి. ఉత్సవములో పాల్గొన్నవారితో చాలమందివద్ద జాతీయజండాలు, యర్రజండాలు, కొన్ని అట్టలు ఉన్నవి. వీటిమీద "హార్వీలు రిపోర్టును రద్దుచేయాలి," "ఆంధ్రరాష్ట్రం కావాలి," "మీరు ప్రజాప్రతినిధులని గుర్తుంచుకోండి. చీరాల కార్మికుల పునర్విచారణ కోరుచున్నారు. "పౌరసత్వ హక్కులను వృద్ధిచేయాలి" అనునవి వ్రాయబడి ఉన్నవి. డిమాన్‌స్ట్రేషనులోనివారు ఈ నినాదములనే ప్రధానామాత్యులు వచ్చుసమయమున పల్కుచుండిరి.

ఈ ముఖ్యమైన విషయములు ప్రజలను చాలా కలవర పరచుచున్నవని, వీటి విషయమై మద్రాసు మంత్రివర్గం ప్రజా కోర్కెననుసరించి పనిచేయాలని, ఈ ప్రకారం మంత్రివర్గం చేయుటకు అవసరమైన ప్రజాభిప్రాయమును కలుగజేయుటకే ఈ డిమాన్‌స్ట్రేషన్ జరుపుతున్నామని, ముందుగానే బహిరంగ సభల ద్వారాను, ఇతర విధముల ప్రచారం చేయబడినది. రైలు దిగి ప్రధానామాత్యులు ట్రావెలర్సు బంగళావైపు నడువసాగిరి. రాజగోపాలాచారిగారిని స్వయముగా చూడకపోవటం చేతను, వారికి నడచునపుడు కష్టంకల్గిన మాట సత్యం. కాని దీనికి డిమాన్‌స్ట్రేషన్‌లోనివారు ఏ విధంగాను బాధ్యులు కాజాలరు, "ఆంధ్ర, హిందూ, ఇండియన్ యక్సుప్రెస్ పత్రికలలో" డిమాన్‌స్ట్రేటర్లు మంత్రివర్గానికి వ్యతిరేకులని, ప్రధానమంత్రి దోవకు అడ్డు తగిలినారని పడ్డవార్త పూర్తిగా అబద్ధం. "ఆంధ్రరాష్ట్రం ఇస్తారా, రాజీనామా ఇస్తారా" అను నినాదం ఈ పైమూడు సంస్థలలో దేని తరపున చెప్పబడి ఉండలేదు."

★ ★ ★

### ఈ రోజుల్లో కూడా!

### కాంగ్రెసు సంఘాలపై పోలీసుల దాడి !!

కాంగ్రెసు మంత్రులు పరిపాలిస్తున్న ఈ రోజుల్లో కాంగ్రెసు సంఘాలపైనే పోలీసులు దాడి వెడలుతున్నారంటే ఎవరికైనా ఆశ్చర్యంగానే వుంటుంది. ఇలా పోలీసులు బాధిస్తున్నారు దీనిని విచారించి తగిన చర్య తీసుకొండి బాబూ అని తాలూకా, జిల్లా కాంగ్రెసు సంఘాలకు మొరపెట్టు కున్నప్పటికీ దానిని గురించి మాట్లాడకుండా మౌనం వహించాయి అంటే ఇంకా ఆశ్చర్యంగా వుంటుంది.

తెనాలి తాలూకా సంఘం జాగర్లమూడి గ్రామ కాంగ్రెస్ సంఘ కార్యనిర్వాహక వర్గం ది 24—4—38 వ తేదీని సమావేశమయింది. ఆ సమావేశంలో 4 తీర్మానాలు చేసి పత్రికలకు, తాలూకా కాంగ్రెసు సంఘానికి పంపారు. ఆ తీర్మానాలు, 1 నాగేశ్వరరావుగారి నిర్యాణమునకు విచారము, 2 చీరాల కాల్పుల నిరసన, 3 కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించాలని. 4 కొత్తపట్నం స్కూలుపై నిషేధాన్ని తొలగించాలని.

ఈ తీర్మానాలు పత్రికలలో ప్రకటించబడిన తరువాత కొందరు పోలీసులువచ్చి గ్రామ మునసబు సహాయంతో మీటింగుకు సంబంధించిన వివరాలకొరకు గ్రామంలో కొందరిని విచారించి కొందరిని బెదరించి వారి దగ్గరనుంచి కొన్ని స్టేట్‌మెంట్లు తీసుకున్నారు. ఈవిధంగా జరిగింది కాబట్టి దీనిని గురించి తగిన విచారణ జరుపవలసినదిగా గ్రామ కాంగ్రెస్ సంఘ కార్యదర్శి కొత్త హనుమంతరావుగారు జిల్లా, తాలూకా కాంగ్రెస్ సంఘములకు 13-5-38 వ తేదీన తెలియజేసిరి. కాని వారెవరు ఇంతవరకు ఏవిధమగు విచారణయు జరిపి యుండలేదు.

ఇటువంటి సందర్భములలో తగిన విచారణ జరిపి, ఈవిధముగా ప్రవర్తించిన ప్రభుత్వోద్యోగులకు తగిన హెచ్చరిక చేయనిచో పోలీసుల జబర్‌దస్తీ మితిమీరును గాన వెంటనే కాంగ్రెస్ ప్రముఖులు తగిన విచారణ జరపాలి. కేసును రుజువు చేయుటకు తగిన సాక్ష్యము, స్టేట్‌మెంట్లు అన్నియు నావద్దనున్నవి.

ముత్తేవి మాధవాచార్య,
కార్యదర్శి.
పట్టణ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, తెనాలి.

★ ★ ★

### మోటారు డ్రయివర్లకు హెచ్చరిక.

మోటారు బస్‌లు ఓవర్‌లోడు చేయుటవల్ల ప్యాశింజర్లకు కలుగు అసౌఖ్యమును గురించిన్ని, బస్సులు వేగంగా నడుపుటవల్ల సంభవించు కష్టములను గురించిన్ని డ్రయివర్లు పూర్తిగా తెలుసుకొని అట్టి దుర్మార్గము చేయకుండుటకుగాను సంఘములుగాచేరి ఆలోచించుచుండినగాని ఆదుర్మార్గము నిర్మూలముగాదు. ప్రతి డివిజన్‌లోను సంఘములు స్థాపించి అట్టి డివిజన్ సంఘములు జిల్లా సంఘముతోను, అట్టి జిల్లాసంఘములు రాష్ట్రీయ సమావేశము జర్పుచు తీవ్రమగు ఆందోళన చేయకుండిన యెడల డ్రయివర్ల నిరుద్యోగముగాని లైసెన్సులు రద్దుఅగుట, ప్రమాదములు సంభవించుట మొదలగు కష్టములు నిర్మూలముకావు అని ఘంటాపదముగా చెప్పగలము. యింతేగాక డ్రయివర్లు ఇన్సూర్యెన్సు చేయించుకొనుట తృప్తికరమైన జీతము లేకుండుట మొదలగు సౌకర్యములులేక చాల హీనస్థితిలో వున్నారు. అట్టి దీనస్థితిని బాపుకొనుటకు సంఘస్థాపన ముఖ్య అవుసరం కాబట్టి ఆంధ్ర రాష్ట్రమునగల జిల్లాలన్నియు జిల్లా సంఘములు, డివిజన్ సంఘములు స్థాపించి ఆంధ్రరాష్ట్రీయ మోటారు ఫెడరేషన్ జరుపుటకు అవకాశము గలిగించెదరని నా ప్రార్థన. యిదివరలో జిల్లా సంఘములు స్థాపించి యున్నయెడల అట్టి జిల్లా సంఘాధ్యక్షులు యీ క్రింద యడ్రెసుతో వుత్తర ప్రత్యుత్తరము జరుప ప్రార్థన.

ఏలూరు } యిట్లు
11—7—38 } కోసూరి నారాయణరావు
ప్రశిడెంటు
పశ్చిమ గోదావరిజిల్లా మోటారు సంఘం

### పేరికలపూడి డాక్టరుగారిపై యస్. వి. యల్. నరశింహంగారి ప్రకటన.

"నవశక్తి" పత్రిక 29-6-38 తేదీ సంచికలో తుమ్మపూడి రైతు సంఘ కార్యదర్శి శ్రీ వాశిరెడ్డి నారాయణ ప్రసాద్‌గారు పంపిన తీర్మానములు ప్రచురింప బడెను. అందు పేరుకలపూడి ధర్మ ఆస్పత్రిలో డాక్టరుగారు లంచములేనిదే బీదలకు మందులిచ్చుట లేదనిన్ని "అవినీతికరము"గా ప్రవర్తిస్తున్నాడనిన్ని సదరు డాక్టరుగారిపై జిల్లా బోర్డువారు చర్య దీనికోవలెననిన్ని తీర్మానించిన విషయం కూడా కలదు. గుంటూరు న్యాయవాది శ్రీ యస్. వి. యల్. నరశింహంగారు సదరుడాక్టరుగారినిగూర్చి తీర్మానములు చేయబడిన నిందారోపణలు కేవలము అసత్యములనిన్ని సదరు డాక్టరుగారు చాలా పలుకుబడి గలవారు మంచివారు అనిన్ని గ్రామస్థులు, చుట్టుపట్ల గ్రామముల వారు వారిని పేరికలపూడి నుండి ట్రాన్సుఫరు చేయవలదని జిల్లాబోర్డు వారిని కోరుతూ మహజరు పంపినారనిన్ని వారి తరపున న్యాయవాదిగా, మాకు వ్రాయుచున్నారు. పాఠకులీ విషయమును గమనింపవలెనని కోరుచున్నాము.

—సంపాదకుడు.

---

## సంస్థానాల ఉద్యమం

(3 వ పేజీ తరువాయి)

మరొక రోజున, సైన్సు కాలేజీలో చదువుకొనే విద్యార్థుల పైబడి అనవసరంగా లాఠీఛార్జి చేశారు. చాలా మందికి గాయాలు తగిలాయి. టెన్నిస్ మొదలైన ఆటలలో నిమగ్నులైన విద్యార్థులను కూడా హింసించారు. దీనికి కారణం : విద్యార్థులు కాని కొంతమంది తుంటరులు పోలీసులను గేలిచేసి వారిని వెంబడించుట. వెంటనే మరునాడు జిల్లా కలెక్టరు సభలు ఊరేగింపులు రెండు నెలల వరకు త్రివేండ్రం జిల్లాలో జరుగరాదని నిషేధించాడు.

### గాంధిగారి సహాయం.

"సంస్థాన కాంగ్రెసు"యొక్క బలం నానాటికి హెచ్చిపోతోంది. 33 రు కాంగ్రెసేతర శాసనసభ్యుల కేమీ తోచక, గాంధిగారి శరణుజొచ్చారు. "సంస్థాన కాంగ్రెసు"వారు దౌర్జన్యకరమైన పనులలో నిమగ్నులై ఉన్నారనియు; హరిపూర్ కాంగ్రెసు తీర్మానం ప్రకారం, వారు సంస్థాన వ్యవహారములలో జోక్యం చేసుకోకూడదనియు, కాంగ్రెసు పేరూ, గాంధిగారిపేరూ వీరు ఉపయోగించుకొంటూ ప్రజలలో దౌర్జన్యాన్ని పురికొల్పుతున్నారనియు అప్పై శాసన సభ్యులు గాంధీగారికి టెలిగ్రాం యిచ్చారు, గాంధిగారి జవాబు యింకారాలేదు.

తిరువాన్కూరు సంస్థానంలో ప్రజల పౌరసత్వపు హక్కులకు తీరని భంగం కలుగుతోంది. విద్యార్థులపై తుంటరులు దౌర్జన్యం చేస్తే, నేరస్థులను పోలీసువారు పట్టుకోలేకపోయారు. బహిరంగ సభలలో అమాయకులైన ప్రజలపైబడి లాఠీఛార్జీలు చేస్తున్నారు. విద్యాలయాలలో తమ పనులలో నిమగ్నులై ఉన్న విద్యార్థుల మీదపడి హింసిస్తున్నారు. పైగా, "సంస్థాన కాంగ్రెసు" దౌర్జన్యకరంగా ప్రవర్తిస్తోందని ప్రభుత్వ సభ్యులు నేరములారోపిస్తున్నారు. కాని, ఆ ఆరోపణలకు ఆధారాలు యెన్నిసార్లు అడిగినా చూపెట్టరు. ఇట్టి దారుణ పరిస్థితులు చూస్తూ, కాంగ్రెసు నాయకులూరుకోవడం యేమాత్రమూ బాగులేదు. రాబోయే కాంగ్రెసు వర్కింగు కమిటీలో తిరువాన్కూరు సమస్య పరిష్కరింప బడుతుందని ఆశిస్తున్నాం.

## పార్టీ సర్క్యులరు

ముఖ్యంగా గమనించాలి.

మే, జూన్ నెలాఖరువరకు పార్టీలో చేరిన సభ్యుల జాబితా వెంటనే ఈ నెలాఖరు లోపల ఆఫీసుకు పంపాలి. అఖిల భారత పార్టీ వారి నూతన నిర్ణయాల ప్రకారం. పాగవు (మామూలు) సభ్యులుండరని. ఈవరకు పాసివు సభ్యులుగా చేరిన వారు వెంటనే ఆక్టివు సభ్యులుగా ఉండడానికి ఒప్పుకుంటారో లేదో కనుగోవాలి. ఒప్పుకోని వారిని అసోసియేటడ్ సభ్యులుగా పరిగణించి జాబితాలు పంపాలి. అసోసియేటడ్ సభ్యులకు ఓటు హక్కు లేదు.

ప్రతి జిల్లా పార్టీ నెలసరి నివేదికలు తప్పకుండా పంపాలి.

ఇకముందు పార్టీలో సభ్యులను చేర్చుకోగల్గింది రాష్ట్రీ పార్టీయే యనియు, నూతన సభ్యుని సూచించేవారు. బలపరచేవారు రాష్ట్రీ పార్టీ కార్య నిర్వాహక సభ్యులు. లేక మూడేండ్ల క్రిందం పార్టీలో చేరినవారుగ ఉండాలని అ॥ భా॥ పార్టీ వారి తీర్మానం. అందుచే ఆంధ్రరాష్ట్రీంలో నూతన సభ్యులను చేర్పించ దలచుకొను స్థానిక కమిటీలు. వారి పేర్లను రాష్ట్రీ కమిటీకి పంపిన. వారు ఆ దరఖాస్తులను అఖిల భారత పార్టీచే ఏర్పరుచబడిన స్క్రూటినీ కమిటీకి పంపెదరు. వారి అంగీకారము పొందిన దరఖాస్తులను రాష్ట్రీ పార్టీ అంగీకరించి క్రింద కమిటీలను తెలియజేస్తుంది. అందుచే పాలకొల్లులో ఆంధ్ర రాష్ట్రీ పార్టీ తీర్మానించిన కాన్‌స్టిట్యూషనులో సభ్యులను చేర్పించుట తొలగించుట అను నియములు ఇకముందు కేవలము రికమెండు జేయునవిగా మాత్రమే వర్తించును.

జిల్లా పార్టీలు వెంజనే జాబితాలు పంపాలి. అఖిలభారత పార్టీకి ఈ నెలాఖరు లోపల ఆలెక్కలను అందజేయవలసి ఉంటుంది.

పి. సుందరయ్య,
కార్యదర్శి. ఆం॥ కాం॥ సో॥ పార్టీ.
బెజవాడ 17—7—38

## ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ, బెజవాడ.

పై మహాసభ సందర్భానికి కావలసిన గీతాలను గురించి మేము పూర్వమొక ప్రకటన కావించాము. దానిని మన్నించి కొందరుత్సాహవంతులు గీతాలను మా కార్యాలయానికి పంపారు. ఆగష్టులో జరుప దలచుకొన్న మహాసభ అక్టోబరుకు వాయిదా వేయబడటంచేత గీతాలు చేరవలసిన తేదీకూడా సెప్టెంబరు 10 వ తేదీ దాకా పొడిగించబడింది. ఆంధ్ర యువ కవులంతా ఈ అవకాశాన్ని వినియోగించుకొంటారని మా నమ్మకము. కొందరు మా అడ్రసుల విషయమై పొరపడుతున్నట్లు తెలుస్తున్నది.

మాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుప దలంచేవారంతా ఈ క్రింది విలాసాలు గమనించాలని ప్రార్థన.

పోష్టలు:"ఆహ్వాన సంఘము,
ఆంధ్రరాష్ట్రీ విద్యార్థి మహాసభ,
బెజవాడ."

టెలిగ్రాఫ్:
జాస్తి నారాయణరావు, బెజవాడ.

టెలిఫోన్: "నెంబరు 3, బెజవాడ."

బి. ఏ. రామచంద్రరావు.
ప్రచురణ శాఖాధికారి.

# అమృతాంజనం

## అన్ని నొప్పులకు దివ్యామృతం

---

## సుధాచంద్రిక

సీసా 1కి రు 2-0-0

సుధాచంద్రిక గనేరియా కారణములగు క్రిములను సంహరించి వ్యాధిని మొదలంట రూపుమాపును. మొదటి మోతాదులో స్రావము కట్టివేయును. మూత్రనాళమందలి మంట, పుంపు, తగ్గించును. ఇతరౌషధములకు లోబడని కేసులు సహితము కుదుర్చును.

## వసంత కుసుమాకరం.

తు 1కి రు 10-0-0

వసంత కుసుమాకరం తు 1కి 10-0-0 శాస్త్రీయముగ తయారు చేయబడినది. శరీర దారుఢ్యమును నరముల పటుత్వము నిచ్చును. అతిమూత్రము మధుమేహము రాచకురుపులకు ప్రసిద్ధికెక్కినది.

**క్షీరసముద్రం ఫార్మసీ,**
**రాజమండ్రి.**

---

## లకోటా ప్రశ్నలు.

ప్రత్యక్ష నిదర్శనం

అయిదు ప్రశ్నలు వ్రాసి కవరులో యుంచి సీలువేసి పంపిన, దేవీ మహిమచే ఫలితము లను వ్రాసి మీ సీళ్ళ కవరు సహా పంపుటకు రు 1—8—0. సంవత్సర ఫలితం నెలవారీ రు 1—12—0. నాడీ గ్రంథములు రీత్యా జాతకములు వ్రాయుదుము. వివరములకు వ్రాయుడు.

నేమాని సోమేశ్వరశర్మ,
శ్రీ సరస్వతీ జ్యోతిషాలయం.
దేవాలయం వీధి. **కాకినాడ.**

---

సుప్రసిద్ధ

## హోమోపతి వైద్య గ్రంధములు.

1 ఆర్గనాన్ అను హోమోపతి సిద్ధాంత శాస్త్రము. వెల. రు 3-0-0.

2 దీర్ఘవ్యాధుల చికిత్స. రు 2-0-0.

ఆలమూరు గ్రామ పునర్నిర్మాణ హోమోపతి వైద్యాలయము.
ఆలమూరు, తూర్పు గోదావరి.

---

## చలంచర్ల నారాయణ మూర్తి గారి

ఫొటో మార్కు

# విష్ణాంజనం

అన్ని నొప్పులకు, కవుకు దెబ్బలకు, మూలవ్యాధులకు, బోదకాళ్లకు, కాల్పులకు, నరుకులకు, తేలు, జెర్రి మొదలగు విష జంతువుల కాట్లకు, పండ్ల బాధలకు, చెవులో చీము, రక్తముకు దివ్యామృతం.

★ అన్ని షాపులయందు దొరకును.
★ ప్రతి టవునుకు యేజంట్లు కావలెను.
★ వివరములకు నేడే వ్రాయండి.

మొదటి రకం అగరువత్తులు, సెంట్లు, హైరాయిల్సు, పునుగు, జవ్వాది, కస్తూరి, జున్ను, గోరోజనం, పచ్చకర్పూరం మొదలగు పరిమళ ద్రవ్యములన్నియు దొరకును.

విష్ణాంజనం డిపో, రాజమండ్రి.

---

## నాడీ గ్రంధజ్యోతిషము.

తమ భూతభవిష్యత్ వృత్తాంతములను తెలియగోరువారు అల్పవ్యయమునకు శంకింపక తమ గ్రహచక్రములను పంపినయెడల జాతకములు వ్రాసి యివ్వబడును.

(1) పూర్వజన్మ వృత్తాంతముతో సంపూర్ణ జాతకము. 5—0—0.
(2) నష్టజాతకము 5—0—0.
(3) భృగువాక్య ప్రకారం ద్వాదశ ఫలములు చదిచెప్పుటకు. 1—0—0.

మహాలక్ష్మి అను ఒక సిద్ధకవచము నావద్ద యున్నది. ఇది ఇష్టార్థసిద్ధియు నిచ్చును.

తాయత్తు వెల: రు. 2—0—0.

అడ్రస్:— టి. యస్. భట్.
శ్రీ భృగునాడీగ్రంధ జ్యోతిర్నిలయం.
C/o కృష్ణార్జున విలాస్. గుంటూరు.

---

## సమ్మర్ స్కూలు ఫోటోలు

మంతెనవారిపాలెం, ఆర్థిక రాజకీయ పాఠశాల విద్యార్థుల ఫోటోలు మావద్ద ఉన్నాయి.

(1) విద్యార్థులందరూ }
(2) స్త్రీలు ప్రత్యేకంగా } సైజు 12" × 10"

| | |
|---|---|
| విడికాపీ (అట్టలేకుండా) | 1-0-0 |
| అన్ రిజిస్టర్డ్ పార్శిల్ ఖర్చు | 0-4-0 |
| | 1-4-0 |

అట్టతో పంపడం వలన పోస్టేజీ అధికమౌతుంది. వి. పి. చేయడం కూడా ధన వ్యయం. కాబట్టి ఫోటోలు కావలసిన వారు ముందే డబ్బు మనియార్డరు చేయండి.

కుమార్ అండ్ కో
బ్లాక్ మేకర్స్ & ఫోటోగ్రాఫర్స్,
తెనాలి.

---

## విచిత్రముల గని, మనస్వ శక్తి

ఈ గ్రంథములో, రూపాయిలను పడగొట్టుచూ వచ్చునట్లు చేయుట. దొంగలు దొంగిలించుక పోయిన వస్తువులు ఫలానా వస్తువులు ఫలానివారు దొంగిలించుక పోయినారని కూర్చున్న తావునుండియే చెప్పి తెప్పించుట, చీట్లపేక ఆటలో యెవరివద్ద ఏయే ముక్కలున్నది చూడకుండా తెలుసుకొనుట, చెప్పుట, పాములను, తేళ్ళనుబట్టి ఆటవస్తువులుగా ఆడించుట, జ్యోతిష్కుల రహస్యములు సీలుజేసిన కవరులోని ప్రశ్నలు కవరు చింపక సీలుతీయక కనుక్కొని జవాబుయిచ్చుట, భూతవైద్యము, సర్వవ్యాధులు గంటలుమీద కుదుర్చుట మొక్కు రహస్యములు గలవు. ఆర్డరుతో పూర్తిసొమ్ము పంపవలెను. అడ్వాన్సులేని ఆర్డరు పట్టము. కొద్ది ప్రతులే వున్నవి. తిరిగి అచ్చువేయించబడవు.

గ్రంధము వెల రు. 2—7—0 లు.

**పి. వి. స్వామినాయుడు, కన్సల్టింగ్ అస్ట్రాలిజర్,**
గొట్టిపాడు గ్రామం, పత్తిపాడు పోస్టు, (గుంటూరుజిల్లా.)

---

## మీ రక్తమును విషపూరితము కానీయకుడు







చర్మముమీద చిన్న పగులున్ననూ అది చాల ప్రమాదకరము. విషక్రిములు శరీరమునందు ప్రవేశించి రక్తమును విషపూరితము చేయగలవు. రక్త ప్రసరణ మండలమంతయు విషక్రిములతో నిండి ఆరోగ్యము ధ్వంసమగును.

'వీటో' రాసినంతనే విషక్రిములు నాశనమయి, రక్తము విషపూరితము కాకుండ కాపాడును.

మీ శరీరము మీద ఎచటనైన కోతగాని, పగులుగాని, వ్రణముగాని, యున్నచో వీటో వాడుడు. అణా బిళ్ళ పంపువారికి శాంపిల్ ఉచితము.

**వీటో మాన్యుఫాక్చరింగ్ కంపెనీ, రాజమండ్రి.**

Printed, Edited and Published by M. Annapurniah at Navasakti Press, Governorpet, Bezwada

